# అనుక్షణం ఆత్మానందం

---

## అష్టావక్ర గీత లోని

## అమృతబిందువులు

---

స్వేచ్ఛానువాదం: బాలాంత్రపు కిరణ్ సుందర్

---

అంకితం

**అమ్మ కి**

అమ్మ: బాలాంత్రపు జ్యోతిష్మతి

(పెద్దాడ రామస్వామిగారి కుమార్తె)

(1925 – 2011)

# కృతజ్ఞత

ఈ నా ప్రయత్నానికి ఒక పుస్తక రూపం ఇచ్చి, డిజిటలైజ్ చేసిపెట్టి, కూడా ఉండి పాటుపడ్డ ఆప్తుడు శ్రీ కంచినాథం రవి శర్మ గారికి...

పుస్తకం చదివి మెచ్చుకుని వీపుతట్టి ప్రోత్సహించి, మంచిమాటలు చెప్పి, 'ముందుమాట' వ్రాసి ఈ పుస్తకాన్ని అలంకరించిన పెద్దలు డా. పప్పు వేణుగోపాలరావు గారికి...

ఈ నా కృషిని ఎంతో గౌరవించి, ప్రోత్సహించి, సహకరించిన నా అర్ధాంగి సుగుణకీ...

నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలు

**బాలాంత్రపు కిరణ్ సుందర్**

# ఉపోద్ఘాతము

[రవి శర్మ]

## అష్టావక్రుడు

అష్టావక్రుని కథ మహభారతం లోనిది. ఉద్దాలక ఋషి గారి వేదపాఠశాలలో కహోడుడు మహా తెలివైన శిష్యుడు. కహోడుని తెలివితేటలకు ముగ్ధుడై ఉద్దాలకుడు తన పుత్రిక సుజాతను అతనికిచ్చి వివాహం చేసాడు. సుజాత తమకు కలుగబోయే పుత్రుడు పరమమేధావి కావాలనే కోరికతో, తను గర్భందాల్చి ఉన్నప్పుడు, ఉద్దాలకుడు, కహోలుడు వేదాలు నేర్పే పాఠశాలలో కూర్చొని, తన గర్భస్తుడైన శిషువుతో సహా మంత్రాధ్యాయనశ్రవణం చేస్తూ ఉండేది. ఒకనాడు కహోడుడు వేదాలు వల్లిస్తూ ఉండగా, సుజాత కడుపులోని శిషువు, "తండ్రీ, ఈ మంత్రోచ్చారణలో తప్పులున్నాయి" అని పలికాడు. కహోడుడు అందరిముందూ జరిగిన ఈ అవమానానికి కోపితుడై "నీవు పరమవికృతాకారముగా జన్మించెదవు గాక" అని శపించాడు.

ఇది ఇలా ఉండగా, ఒకనాడు కహోడుడు జనక మహారాజు పెద్ద యజ్ఞమేదో చేయబోతున్నాడని ఆయన వద్దకు యాచనకోసమని వెళ్ళాడు. జనకుడు కహోడుని మర్యాదగా అహ్వానించి, "కహోడా, నేను చేయదలచుకున్న యజ్ఞం సాగటం లేదు. మన సభకు వంధి అనే ఋషి విచ్చేసి, ఆయనను పాండిత్యం లో ఓడించిన పిమ్మటే ఈ యజ్ఞం జరగాలని కోరాడు. పైగా ఆయనతో వాదించి

ఓడిపోయినవాళ్ళను సముద్రంలోనికి విసిరేయాలని షరతుపెట్టాడు. నా వద్ద ఉన్న పండితులందరూ ఒక్కొక్కరే సముద్రంపాలైపోయారు. నువ్వైనా వీడిని గెలవాలి" అని విన్నవించాడు. కహోడుడు అందుకు అంగీకరించి, వంధితో పోటీలోకి దిగాడు. కానీ ఓడిపోయి, ఆయనకూడా సముద్రం పాలైపోయాడు.

అక్కడ సుజాతకు శిశువు జన్మించాడు కానీ, శాపవశాత్తు పరమ వికృతంగా పుట్టాడు. వాని శరీరం అనేకమైన వంకరలు కలిగియుండటంచేత వానికి 'అష్టావక్రుడు' అనే పేరు కలిగింది. అయితే అష్టావక్రుడు పరమ మేధావి. తనకు పన్నెండోయేడు వచ్చినప్పటికే, ఉద్దాలకుని వద్ద నేర్చుకోవలసినదంతా ముగించాడు. అప్పటికి అతనికి తన తండ్రి దురవస్థ గురించి తెలియడమూ, వంధిని ఎవ్వరూ పరాజితుని చేయలేకపోవటం వలన జనకుని యజ్ఞం ఇప్పటికీ అసంపూర్తిగానే ఉన్న విషయం తెలియడమూ జరిగాయి. తన మామ శ్వేతకేతుతో కలసి జనకమహారాజు వద్దకు వెళ్ళాడు. జనకుడు వీని వికృతస్వరూపానికి విస్తుపోయినా, వాని పాండిత్యానికి అచ్చెరువొంది మర్యాదగా ఆహ్వానించాడు. అష్టావక్రుడు వంధిని సునాయాసంగానే ఓడించి, వంధిని ప్రతీకారార్థం సముద్రంలోనికి విసిరివేయాలని కోరాడు. అప్పుడు వంధి తన నిజస్వరూపాన్ని తెలియజేసి, "బాబూ! నేను వరుణపుత్రుణ్ణి. నా తండ్రి తన పన్నెండు సంవత్సరాల యజ్ఞానికి అతి ప్రశస్తులైన ఋత్విక్కులు కావాలని కోరాడు. అయితే వాళ్ళను సేకరించి సముద్రములోనికి తీసుకుపోవడానికి నాకు ఇది ఒక్కటే మార్గం గోచరించింది. ఇప్పుడా పన్నెండు సంవత్సరాలూ గడిచిపోయాయి, యజ్ఞమూ అయిపోయింది. ఇక వారందరినీ మనం తిరిగి తీసుకురావచ్చు" అని చెప్పాడు. అందరూ సముద్రతీరానికి పోయి, ఈ ఋత్విక్కులందరూ సముద్రంనుండి బయటకి రావటం తిలకించి ఆనందించారు.

కహోడుడు, తన పుత్రుడి పాండిత్యానికి చాలా గర్వపడ్డాడు. తండ్రిని మించిన తనయుడని కొనియాడాడు. వంధి అష్టావక్రుని నీటిలో ఒకసారి ముంచి, తన తండ్రి వరుణుని శక్తిచేత వాని వికృతరూపం పోగొట్టి శాపవిమోచనం కలిగించాడు. కానీ ఆయన పేరు అష్టావక్రుడనే ఉండిపోయింది.

## గీత వృత్తాంతం

ఒకానొకప్పుడు ఆస్థానంలో వేదాంతచర్చలు జరుగుతూండగా, సందర్భవశాత్తు "మనిషి గుర్రమెక్కేటప్పుడు ఒక కాలు రికాబులో పెట్టాక, పైకిలేవడానికి రెండవకాలు ఎత్తేలోపు తత్త్వదర్శనం అయిపోతుంది" అని పండితుడు చదువుతుండగా జనక మహారాజు అది వినడం తటస్థించింది. అంటే ఆత్మసాక్షాత్కారం అంత వేగంగానూ, అంత హఠాత్తుగానూ సంభవించేస్తుందన్నమాట! ఇదివిన్న మహారాజు వేంటనే ఒక గుర్రం సభలోనికి తెప్పించేసి, ఆ పండితుడిని ఈ వ్యాఖ్య ఋజువు చేయమని ఆదేశించాడు. అయితే పండితుడు వేదాంతజ్ఞానాన్ని ఈ విధంగా ప్రత్యక్షంగా నిరూపించడం తన వలన సాధ్యంకాని పని అని మొరపెట్టుకున్నాడు. దానికి జనక మహారాజు కోపగించుకొని "అయితే ఈ శాస్త్రాలు అసత్యమయినా కావాలి లేదా అతిశయోక్తి అయినా అయిఉండాలి' అని ఆక్షేపించాడు. తనవలన ఈ వ్యాఖ్య ఋజువు చేయడానికి చేతకాకపోయినా, ఇవి జ్ఞానులైన ఋషుల వాక్కులు కావడం చేత అసత్యాలూ, అతిశయోక్తులూ కానేరవని ఆ పండితుడు బదులిచ్చాడు. జనకుడికి వళ్ళుమండి ఆ పండితుడిని కారాగృహంలో తోయించివేసాడు. ఇంతేకాక తన సభకు వచ్చే ప్రతి పండితుడిని ఈ వ్యాఖ్యను

ప్రత్యక్షంగా ఋజువు చేయమని సవాలు చేస్తూ, అది చేయలేని పక్షంలో వారిని బందీలు చేసేయటం మొదలుపెట్టాడు.

ఇలా జరుగుతూఉండగా, అష్టావక్ర ముని దేశభ్రమణం చేసుకుంటూ జనకుని రాజ్యంలోనికి రావడం సంభవించింది. మాటామాటల్లో ఆయనకు జనక మహారాజు చేస్తున్న ఈ విషయం తెలిసింది. ఆయన సరాసరి రాజుగారి ఆస్థానానికి విచ్చేసి, పండితులందరినీ ఏ కారణంచేత కారాగృహంపాలు చేస్తున్నారని జనక మహారాజును ప్రశ్నించాడు. మహారాజు కారణం చెప్పాడు. "సరే, ఇక వాళ్ళందరినీ విడుదల చెయ్యండి" అని అష్టావక్రుడు ఆదేశించాడు. తన సందేహనివృత్తి చేయగలిగినవాడే అంతధైర్యంగా ఈ విధమైన ఆదేశమివ్వగలడు అని మహారాజుకి త్రోచి, బందీలైన పండితులందనీ విడుదల చేసి, అష్టావక్రునితో "సరే, ఇక గుర్రం తెప్పిస్తాను, నాకు ఆత్మానుభవం కలుగచేస్తారా" అని అడిగాడు.

ముని రాజును తొందరపడవద్దని హెచ్చరించాడు. బ్రహ్మజ్ఞానం ఏకాంతంలోనే కాని నిండుసభలో కలుగచేసేది కాదన్నాడు. సరే, నిర్జనప్రదేశానికి పోదామని, అష్టావక్రుని ఒక పల్లికిలో ఎక్కించి, వెనుక తన అనుచరులతో సహా గుర్రాలెక్కి, మహారాజు ఊరిబయటకు బయలుదేరాడు. అలా అరణ్యప్రాంతం చేరుకున్నాక, ముని రాజును ఇక తమకు ఏకాంతం కలిగేలాగ తన అనుచరలందరినీ వెనక్కి పంపించివేయమని ఆదేశించాడు. వారందరూ తిరిగిపోయినవెమ్మటే, జనకమహారాజు గబగబా ఒకకాలు రికాబులోపెట్టేసి, "స్వామీ, ఇక నాకు ఆత్మజ్ఞానం అందించండి" అని ఆతృతగా అష్టావక్రుని అర్థించాడు. "ఆగు జనకా! ఆ శాస్త్రాలలోనే, – బ్రహ్మజ్ఞానం అనేది గురువు శిష్యుడికి కలుగచేస్తాడు – అని వివరింపబడి ఉంది. మరి మన ఇరువురికీ అటువంటి గురుశిష్య సంబంధం

ఉన్నదా?" అని అష్టావక్రుడు ప్రశ్నించాడు. జనకుడు ఆయనకాళ్ళకు మ్రొక్కి, తనను శిష్యునిగా స్వీకరించమని ప్రార్థించాడు. అష్టావక్రుడు మరల "శిష్యరికం పొందాలంటే మరి శిష్యుడు తననూ, తన తనువూ, మనస్సూ, ధనమూ అన్నీ గురువుకు అప్పగించేసి శరణాగతి పొందాలే" అని అన్నాడు. మరుక్షణం జనకుడు రాజ్యంతో సహా తన సర్వస్వాన్నీ ఆయనకు ధారపోసి, ఆయన పాదాలు పట్టుకుని శరణు, శరణన్నాడు. అష్టావక్రుడు "సరి" అని ఒక్కమాటన్నాడు. జనకుడు స్తంభించిపోయాడు. అష్టావక్రుడక్కడినుంచి అంతర్ధానమైపోయాడు. జనకుడు కదలిక లేకుండా ఉన్నచోటే శిలలా నిశ్చేష్టుడై నిలబడిపోయాడు.

అలా ఎంతో సమయం గడిచిపోయింది. సంధ్య వ్రాలుతూ ఉంది. ప్రజలూ, మంత్రులూ జనకమహారాజు ఎంతసేపటికీ తిరిగిరాకపోయేటప్పటికి ఆందోళన చెంది వెతుక్కుంటూ అడవిలో ఆయన నిలబడిఉన్నచోటికి చేరారు. ఆయనకు వీరందరి ఉనికే తెలియలేదు. ప్రతిచర్యా లేదు. స్థాణువులా నిలబడి ఉన్నాడు. ఈ అపస్మారక స్థితి చూసి నిర్ఘాంతపోయి, భయపడి, అందరూ అష్టావక్రుని వెదకటం మొదలుపెట్టారు. వీడెవడో మాంత్రికుడై ఉంటాడనీ, రాజుగారిమీదేదో ప్రయోగం చేసి ఈ దుఃస్థితి కలుగచేసాడని, వాడిని వెదికి పట్టుకు శిక్షించాలనీ రకరకాల తీర్మానాలు చేసుకుంటూ, రాజుగారి శరీరాన్ని ఒక పల్లకిలో మోసుకుని రాజమందిరానికి తీసుకుపోయారు.

సమయం గడిచేకొద్దీ రాజుగారి పరస్థితిలో ఎటివంటి మార్పూ రాకపోయేసరికి, మంత్రులు అష్టావక్రుని గాలించి వెదికి తీసుకురావటానికి రాజ్యంలొ అన్నివైపులా చారులను పంపారు. బాగా చీకటిపడేవేళకు అష్టావక్రుని వెదికి పట్టుకున్న భటులు ఆయనను రాజభవనానికి తీసుకువచ్చారు. మంత్రులు

వాళ్ళకోపాన్ని దిగమ్రింగకుంటూ అష్టావక్రునితో మహారాజును తిరిగి ఆయన సహజ స్థితిలోకి తీసుకురమ్మని ప్రాధేయపడ్డారు. కొందరేమో రాజుగారి ప్రస్తుత దైన్యస్థితికి అష్టావక్రుడే కారణమని ఆక్షేపించారు. అష్టావక్రుడు చిరునవ్వు నవ్వి మంత్రులతో ఆ సంగతి రాజుగారినే అడిగితెలుసుకోమన్నాడు. మంత్రులు రాజుగారిలో ఎటువంటి చలనమూ కలుగచేయడంలో తాము విఫలులైపోయామని తెలియచేసారు. అష్టావక్రుడు, అలాగా అని రాజుగారివైపు తిరిగి "జనకా" అని పిలిచాడు. జనకుడు అంజలిఘటించి "ప్రభూ" అన్నాడు. అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆష్టావక్రుడు "జనకా, వీరందరూ నీ దుఃస్థితికి నేనే కారణమని నిందిస్తున్నారు. వాళ్ళ సంశయం తీర్చు" అని అన్నాడు. జనకుడు ఉగ్రుడై అష్టావక్రుని నిందించినదెవ్వరని అడిగాడు. మంత్రులు భయకంపితులైనా, అష్టావక్రునితో రాజుగారికి పూర్వస్థితి కల్పించమని ప్రాధేయపడటం ఆపలేదు. అష్టావక్రుడు తామిరువురికి ఏకాంతం కలిగేట్లు వారందిని నిష్క్రమించమని ఆదేశించాడు. అందరూ వెళ్ళాక అష్టావక్రుడు "జనకా, నీ ఈ విచిత్రమైన నడవడికకు కారణమేమిటి? ఎందుకు ఇలా వింతగా ప్రవర్తిస్తున్నావు?" అని ప్రశ్నించాడు. దానికి జనకుడు "ప్రభూ, ఇప్పుడు నేను మీ దాసుడను. కేవలం మీ ఆజ్ఞలకే స్పందించగలను" అని విన్నవించాడు. అప్పుడు అష్టావక్రుడు "బ్రహ్మజ్ఞానం అనేది కేవలం దానికి పాత్రులయినవారికే ప్రసాదింపవచ్చును. నేను ఇంతసేపూ నీ పాత్రతను పరీక్షించాను. సంతోషపడ్డాను. ఇక నీ భోజనాది కార్యాలను ముగించుకు కూర్చున్నావంటే మన చర్చను కొనసాగిద్దాము" అని అన్నాడు. జనకుడు ఆహారం స్వీకరించి, వచ్చి, "మహానుభావా, జ్ఞానమెలా సిద్ధిస్తుంది? ముక్తి ఎలా కలుగుతుంది? అసలు వైరాగ్యం ఎలాగ ప్రాప్తిస్తుంది? ఇదంతా నాకు చెప్పండి ప్రభూ!" అని ప్రార్థించాడు.

అష్టావక్రుడు "బ్రహ్మ అనేది నీ నుండీ వేరుగా ఉన్న కొత్త పదార్థమేమీకాదు. బ్రహ్మను తెలుసుకోవడానికి వేళావిశేషాలతో పనిలేదు. తత్త్వమసి. అదే నువ్వు. నువ్వే అది. అదే అనాది, అనంతమైన ఆత్మ" అంటూ బోధించసాగాడు. ఈ విధంగా ఆయన అష్టావక్రగీతను విశదపరస్తూఉంటే రాత్రంతా గడిచిపోయింది.

తెల్లవారాక రాజదర్శనానికి వచ్చిన మంత్రులందరూ రాజుగారిని చాలా స్వాభావికంగా ఉండటం చూసి ఆనందించారు. అష్టావక్రుని కొనియాడారు. జనకుడు కొలువు తీర్చి తన ధర్మాలను ఎప్పటిలాగానే నిర్వర్తించసాగాడు. నిండుసభలో అష్టావక్రుడు "ఓ రాజా, ఇదివరకు నీకు బ్రహ్మజ్ఞానమనేది శాస్త్రాలలో చెప్పినట్లు హఠాత్తుగా, అపరిమితవేగంగా కలుగవచ్చుననే విషయంపై అనుమానముండేది. ఆ శాస్త్రాలు నిజమేనా అని సంశయించావు. ఇప్పుడు నీ అనుభవం ఏమిటి? గుర్రాన్ని సభలోకి తెప్పించి, ఈవ్యాఖ్యలోని సత్యాన్ని నిరూపిస్తావా?" అని అడిగాడు.

జనక మహారాజు సవినయంగా, నమ్రతతో "ప్రభూ, నేనప్పుడు సంపూర్ణమైన భ్రమలో ఉండినాను. తప్పు నాదేను. నా అజ్ఞానం వలన శాస్త్రాలను సంశయించాను. ఆహా! వాటిలోని ప్రతి పదమూ సత్యమే.' అని ప్రకటించాడు.

**ఓం తత్ సత్.**

జ్ఞానమెలా సిద్ధిస్తుంది?

ముక్తి ఎలా కలుగుతుంది?

అసలు వైరాగ్యం ఎలాగ ప్రాప్తిస్తుంది?

ఇదంతా నాకు చెప్పండి ప్రభూ!

— అని జనకుడు అడిగాడు.



*ప్రథమోధ్యాయః*

జనక ఉవాచ ||

కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి |

వైరాగ్యం చ కథం ప్రాప్తం ఏతద్బ్రూహి మమ ప్రభో || 1-1 ||

అష్టావక్రు డన్నాడు –

నాయనా! ముక్తి కావాలంటే ఇంద్రియభోగ విషయాలను

విషంగా ఎంచి వదిలిపెట్టు.

సహనమూ, నిజాయతీ, కరుణా, సంతృప్తి, సత్యవాక్పాలన –

వీటిని అమృత ప్రాయంగా పరిగణించి వరించు.



అష్టావక్ర ఉవాచ ||

ముక్తి మిచ్ఛసి చే త్తాత విషయాన్ విషవ త్త్యజ |

క్షమార్జవదయాతోషసత్యం పీయూషవ ద్భజ || 1-2 ||

నీ దేహంలో ఉన్న పంచభూతాలైన

పృథ్వీతత్త్వమూ, నీరు, అగ్ని, వాయువూ, ఆకాశతత్త్వమూ –

వీటిలో ఏ ఒక్కటీ కూడా నీవు కావు.

ముక్తిని పొందాలంటే

వీటన్నిటినీ సాక్షిగా నిలిచిచూస్తూఉన్న ఆత్మస్వరూపునిగా,

చైతన్యరూపమైన ఆత్మవుగా

నిన్ను నీవు తెల్సుకో.



న పృథ్వీ న జలం నాగ్ని ర్నవాయు ర్ద్యౌర్న వా భవాన్ |

ఏషాం సాక్షిణ మాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే || 1-3 ||

నీవు కనక నీ దేహాన్ని నీనుండి వేరు పరచి,

"నేను ఉన్నాను" అన్న చేతనలో, ఎఱుకలో

విశ్రమించి ఉండగలిగితే,

ఇప్పటి కిప్పుడే సుఖాన్నీ శాంతినీ అనుభవించగలవు.

బంధవిముక్తుడివి కాగలవు.



---

యది దేహం పృథక్ కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి |

అధునైవ సుఖీ శాన్తో బన్ధముక్తో భవిష్యసి || 1-4 ||

నీవు బ్రాహ్మణ, క్షత్రియాది వర్ణాలకు చెందినవాడవు కావు.

నీకు గార్హస్థ్యమూ, సన్యాసమూ వంటి ఆశ్రమాలు లేవు.

నీ వసలు కంటికి అగుపించేవాడవు కావు.

నీవు ఏదీ అంటనివాడవు.

ఆకారానికి కట్టుబడనివాడవు.

జరుగుతున్నవీ, కనబడుతున్నవీ అన్నిటినీ చూస్తూ ఉండే

విశ్వసాక్షివి.

ఆనందంగా ఉండు.



---

న త్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః |

అసఙ్గోఽసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీ భవ || 1-5 ||

ధర్మమూ, అధర్మమూ, సుఖమూ, దుఃఖమూ

ఇవన్నీ మనస్సుకు సంబంధించినవి.

సర్వవ్యాపియైన నీకు చెందినవి కావు.

నీవు కర్మలు చేసే కర్తవూ కావు,

ఫలితాల ననుభవించే భోక్తవూ కావు.

నీవు ఎల్లవేళలయందూ ముక్తుడవే.



---

ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని న తే విభోః |

న కర్తాసి న భోక్తాసి ముక్త ఏవాసి సర్వదా || 1-6 ||

సర్వాన్నీ చూసే ఏకైక ద్రష్టవు నువ్వే.

ఎప్పుడూ కూడా నువ్వు ముక్తప్రాయుడవే.

జీవన్ముక్తుడవే.

నీ బంధమల్లా ఏమిటంటే,

ఈ ముక్తుడై అన్నిటినీ చూసే ద్రష్టను

అది ఇంకెవరో ఇతరు డనుకుంటుంటావు.



ఏకో ద్రష్టాసి సర్వస్య ముక్తప్రాయోఽసి సర్వదా |

అయ మేవ హి తే బన్ధో ద్రష్టారం పశ్యసీతరమ్ || 1-7 ||

“నేను కర్తను” అనే

అహంభావవిషం పూరించే నల్లత్రాచు చేత కాటువేయబడ్డావు.

“నేను కర్తను కాను” అన్న విశ్వాసం అమృతం లాటిది.

ఆ అమృతాన్ని సేవించి ఆనందంగా ఉండు.



అహం కర్తే త్యహంమానమహాకృష్ణాహిదంశితః |

నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీ భవ || 1-8 ||

"నేను ఏకాత్మను;

ఆలోచనలతో కలవని వట్టి శుద్ధమైన స్పృహను"

అన్న నిశ్చయం నిప్పు లాటిది.

ఈ నిప్పుతో నీ అజ్ఞానపు అడవిని కాల్చి బూడిద చేసి

శోకము వీడినవాడవై ఆనందంగా ఉండు.



---

ఏకో విశుద్ధబోధోఽహం ఇతి నిశ్చయవహ్నినా |

ప్రజ్వాల్యా జ్ఞానగహనం వీతశోకః సుఖీ భవ || 1-9 ||

తాడును చూసి అది పాము అన్న భ్రమ కలిగి

అక్కడ పాము కల్పితమైనట్టు,

దేనియందు ఈ ప్రపంచమంతా కల్పితమై కనిపిస్తోందో,

ఆ ఆనంద పరమానంద చైతన్యానివే నీవు.

ఆనందంగా ఉండు.



యత్ర విశ్వ మిదం భాతి కల్పితం రజ్జు సర్పవత్ |

ఆనన్దపరమానన్దః సబోధ స్త్వం సుఖం చర || 1-10 ||

తాను ముక్తుడే అనుకునేవాడు నిజంగా ముక్తుడు.

తాను బద్ధుడే అనుకునేవాడు బద్ధుడై ఉంటాడు.

"ఎట్లు తలచిన అట్లే అగును" అన్న సామెత నిజమే.



ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమా న్యపి |
కింవద న్తీహ సత్యేయం యా మతిః సా గతి ర్భవేత్ || 1-11 ||

ఆత్మ ఊరికే చూస్తూ ఉండేటువంటిది.

అంతటా వ్యాపించినది. వెలితి లేనిది.

తనకు భిన్నమైన దేదీ లేని ఏకైక మైనది.

ఏ బంధమూ, మోహమూ లేనిది. చైతన్యస్వరూపమైనది.

ఏమీ చేయనిది, చేయడాని కేమీ లేనిది. ఏదీకూడా అంటనిది.

కోరికలు లేనిది. శాంతమైనది.

భ్రమ చేత ఏదో జీవాత్మలాగ, అహంకారంలాగ,

సంసారంలో పడ్డట్టు అగుపిస్తుందంతే.



ఆత్మా సాక్షీ విభుః పూర్ణ ఏకో ముక్త శ్చి దక్రియః |

అసంగో నిస్పృహః శాన్తో భ్రమాత్ సంసారవా నివ || 1-12 ||

నీ ఉనికియే అంతటికీ ఆధారం.

నీ ఉనికియొక్క ఎఱుకయే మెలకువ.

అది తప్ప మరొకటి లేదిక్కడ.

"నేను జీవాత్మను. పరమాత్మకి ప్రతిబింబాన్ని మాత్రమే"

అన్న భ్రమనూ,

"నా లోపలా, నా వెలుపలా" అన్న భావాలనూ విడనాడి,

నీ ఉనికినే గమనించి ధ్యానించు.



కూటస్థం బోధ మద్వైత మాత్మానం పరిభావయ |

ఆభాసోఽహం భ్రమం ముక్త్వా భావం బాహ్య మథాన్తరమ్ || 1-13 ||

“నేను శరీరాన్ని” అన్న తలపే నిన్ను

చిరకాలంనుండీ పాశంలా కట్టిపడేసింది, కుమారా.

“నేను తెలివిని” అని తెలుసుకున్న జ్ఞానఖడ్గంచేత

ఆ దేహాభిమానపాశాన్ని తెంచివేసుకుని

ఆనందంగా ఉండు.



---

దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక |

బోధోఽహంజ్ఞానఖడ్గేన తం నికృన్త్య సుఖీభవ || 1-14 ||

నువ్వు బంధాలు లేనివాడవు. నిష్క్రియుడవు.

తనంతట తానే తెలియబడేటటువంటి స్వయంప్రకాశుడవు.

మచ్చలూ, కళంకాలూ లేని నిరంజనుడివి.

నీ బంధమల్లా ఏమిటంటే

నీవు సమాధిధ్యానాన్ని అభ్యసిస్తావు. అదే అడ్డు.



నిస్సంగో నిష్క్రియోఽసి త్వం స్వప్రకాశో నిరంజనః |

అయమేవ హి తే బన్ధః సమాధి మనుతిష్ఠసి || 1-15 ||

ఈ ప్రపంచ మంతటాకూడా వ్యాపించి నీవే నిండియున్నావు.

ఈ ప్రపంచంలోని వన్నీ – దారంలో పూసలు గుచ్చబడ్డట్టు –

నీయందే ప్రోతమై ఉన్నాయి.

నిజానికి నువ్వు ఏకల్తీ లేని శుద్ధస్వరూపుడవు.

'తెలివి' అని మనకు తెలిసే బోధస్వరూపుడవు.

కుంచితస్వభావాన్ని పెంపొందించుకోకు.

చెడుతలపులు అలవరచుకోకు.



త్వయా వ్యాప్త మిదం విశ్వం త్వయి ప్రోతం యథార్థతః |

శుద్ధబుద్ధస్వరూప స్త్వం మాగమః క్షుద్రచిత్తతామ్ || 1-16 ||

నీవు అపేక్షలు లేనివాడివి. వికారాలు పోనివాడివి.

నిండైన వాడవు. కోరికల వేడి చల్లారినవాడవు.

లోతైన బుద్ధి గలవాడవు. క్షోభ పడనివాడవు.

అది తెలిసి, కేవలం

చైతన్యాన్ని మాత్రమే వరించే వాసన మిగిలియున్నవాడవు కమ్ము.



నిరపేక్షో నిర్వికారో నిర్భరః శీతలాశయః |

అగాధబుద్ధి రక్షుబ్ధో భవ చిన్మాత్రవాసనః || 1-17 ||

ఆకారం కలిగియున్న దేదైనాకూడా

సత్యంకానిది, నిజంగాలేనిది అని తెలుసుకో.

నిరాకారమైనదే నిశ్చలమైనది. మారనిది. కదలనిది.

శాశ్వతమైనది.

ఈ తత్త్వోపదేశం పొందటంచేత

నీకు మళ్ళీ ఈ సంసారంలో పుట్టటం తప్పుతుంది.



సాకార మనృతం విద్ధి నిరాకారం తు నిశ్చలమ్ |

ఏతత్తత్త్వోపదేశేన న పున ర్భవసంభవః || 1-18 ||

ఏ విధంగానైతే అద్దంలోపల ప్రతిబింబంగానూ,

బయటి బింబంగానూకూడా చూసేవాడే ఉన్నాడో,

అదేవిధంగా, ఈ శరీరంలోపల సాక్షిగానూ,

బయట దృశ్యంగానూ కూడా ఉన్నది పరమేశ్వరుడే.



యథై వాదర్శమధ్యస్థే రూపేఽన్తః పరితస్తు సః |

తథై వాఽస్మిన్ శరీరేఽన్తః పరితః పరమేశ్వరః || 1-19 ||

అంతటా తానే వ్యాపించియున్న ఆకాశం ఏ విధంగానైతే

ఒక కుండలోపలా వెలుపలా కూడా ఉంటుందో,

అదేవిధంగా, నిత్యమూ నిరంతరంగా (విరామం లేక) ఉండే

ఆ పరబ్రహ్మము జీవుల కన్నిటికీ

లోపలా వెలుపలా కూడా నిండియున్నది.





---

ఏకం సర్వగతం వ్యోమ బహి రన్త ర్యథా ఘటే |

నిత్యం నిరన్తరం బ్రహ్మ సర్వభూతగణే తథా || 1-20 ||

ఇతి ప్రథమోధ్యాయః

ఆహా! నేను నిరంజనుడను. శాంతస్వరూపుడను.

ప్రకృతికీ, గుణగణాలకీ అతీతమయిన చైతన్యాన్ని. ఎఱుకను.

ఇంతకాలం ఏమరుపాటుతో

మోహం చేత, మాయచేత, మోసపోయాను.

— అని జనకు డన్నాడు.



---

*ద్వితీయోధ్యాయః*

జనక ఉవాచ ||

అహో నిరంజనః శాన్తో బోధోஉహం ప్రకృతేః పరః |

ఏతావన్త మహం కాలం మోహే నైవ విడంబితః || 2-1 ||

ఎలాగైతే ఈ దేహాన్ని కేవలుడనైన నేనే విదితం చేసుకుంటున్నానో,

అలాగే, ఈ జగత్తును కూడా నేనే కనుపింప చేస్తున్నాను.

అందుచేత, ఈ జగత్తు యావత్తూ నాదే.

యావత్తూ నాది కాకపోతే ఏదీ నాది కాదు.



---

యథా ప్రకాశయా మ్యేకో దేహమేనం తథా జగత్ |

అతో మమ జగత్సర్వమథవా న చ కించన || 2-2 ||

ఆహా, శరీరంతో సహా ఈ విశ్వాన్నంతటినీ పక్కనపెట్టి చూడగా,

ఏదో ఒక తెలియని నేర్పుచేత

నాకు ఇప్పటికిప్పుడే పరమాత్ముడు తెలియవస్తున్నాడు.



సశరీర మహో విశ్వం పరిత్యజ్య మ యాధునా |

కుతశ్చిత్ కౌశలా దేవ పరమాత్మా విలోక్యతే || 2-3 ||

ఎలాగైతే అలలూ, బుడగలూ, నురగా,

ఇవేవీ కూడా నీటినుంచి వేరైనవి కావో,

అలాగే ఈ నా ఆత్మనుండి ఉత్పన్నమైన ఈ విశ్వం,

ఆత్మకు భిన్నమైనది కాదు.



---

యథా న తోయతో భిన్నా స్తరంగాః ఫేనబుద్బుదాః |

ఆత్మనో న తథా భిన్నం విశ్వ మాత్మవినిర్గతమ్ || 2-4 ||

విచారించి చూస్తే ఎలాగైతే

గుడ్డ నిజానికి వట్టి నూలే అని తేలుతుందో,

అలాగే, విచారం చేసి చూస్తే

ఈ విశ్వం నిజానికి ఆత్మేగాని మరేదీ కాదని తేలుతుంది.

నూలే గుడ్డగా కనిపించినట్టు,

ఆత్మే విశ్వంగా కన్పట్టుతూంది అన్నమాట.



---

తన్తుమాత్రోభవే దేవ పటో యద్వ ద్విచారితః |

ఆత్మతన్మాత్రమే వేదం తద్వ ద్విశ్వం విచారితమ్ || 2-5 ||

ఎలాగైతే చెరుకురసంలో ఇమిడి ఉన్న చక్కెర

అణువణువు ఆ చెరుకురసంగానే వ్యాప్తమై ఉన్నదో,

అలాగే, నాలో ఇమిడిఉన్న ఈ విశ్వంలో

అణువణువునా నేనే నిండి ఉన్నాను.



యథై వేక్షురసే క్ళప్తా తేన వ్యా ప్తైవ శర్కరా |

తథా విశ్వం మయి క్ళప్తం మయా వ్యాప్తం నిరన్తరమ్ || 2-6 ||

తాడును తాడని తెలుసుకోకపోవటంచేత

అక్కడ పాము కనిపిస్తుంది.

అది తాడేనని తెలుసుకున్నతరువాత,

అక్కడ ఇంక పాము కనబడదు.

అదే విధంగా, ఆత్మను తెలుసుకోకపోవటం వలన

జగత్తు కనిపిస్తుంది.

ఆత్మను తెలుసుకుంటే, తనకంటే భిన్నమైనదిగా

జగత్తు వేరుగా కన్పట్టదు.



---

ఆత్మాజ్ఞానా జ్జగద్భాతి ఆత్మజ్ఞానా న్నభాసతే |

రజ్జ్వజ్ఞానా దహిర్భాతి తజ్జ్ఞానా ద్భాసతే న హి || 2-7 ||

ప్రకాశమే, అనగా ఎఱుకయే, నా అసలు స్వరూపం.

నేను ఎఱుకకన్న వేరైనది కాను.

విశ్వం ప్రకాశించింది,

విశ్వం యొక్క ఎఱుక నాకు కలిగిందీ అంటే,

ఆ ప్రకాశాన్నైన నేను కూడా అక్కడే విదితమై ఉన్నది ఖాయం.



ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః |

యదా ప్రకాశతే విశ్వం తదాహం భాస ఏవ హి || 2-8 ||

ఆహా, కల్పనామాత్రమయిన ఈ విశ్వం,

అజ్ఞానంచేత నాలో పొడసూపుతో ఉంటుంది కదా!

అది, ముత్యపుచిప్పలో వెండిలాగా,

తాడు మీద పాము కన్పింపబడినట్టుగా,

ఎండమావిలో నీళ్ళున్న భ్రమ కలిగినట్టుగానే

భ్రమే కదా!



అహో వికల్పితం విశ్వ మజ్ఞానా న్మయి భాసతే |

రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా || 2-9 ||

మట్టినుంచి కుండ నిర్మితమైనట్టుగా,

నీటినుంచి అల లేచినట్టుగా,

బంగారమునుంచి వడ్డాణం తయారయినట్టుగా,

ఈ లోకం (నిద్ర లేవగానే) నాలోనుండే ఉత్పన్నమయి,

మళ్ళీ (నిద్రపోయినప్పుడు) నాలోకే లయమైపోతుంది.

కుండని పగలగొట్టితే, మళ్ళీ తిరిగి మట్టే అయిపోతుంది.

అల లేచిపడ్డాక మళ్ళీ నీటిలోకే కలిసిపోతుంది.

వడ్డాణం కరిగిస్తే మళ్ళీ బంగారమే అయి మిగులుతుంది.



---

మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయ మేష్యతి |

మృది కుంభో జలే వీచిః కనకే కటకం యథా || 2-10 ||

అబ్బో! ఆద్భుతం నేను! ఈ నాకు దణ్ణాలు!

బ్రహ్మనుండి ఒక గడ్డిపోచవరకు

ఈ జగత్తంతా వినాశం చెందినాకూడా,

చెక్కు చెదరక నిలిచి ఉండే నాకు ఇవే దణ్ణాలు!



---

అహో అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తి మే |

బ్రహ్మాదిస్తంబపర్యన్తం జగన్నాశేఽపి తిష్ఠతః || 2-11 ||

ఓహో నేను! ఆహా, నాకు దణ్ణాలు!

దేహవంతుడనైనాగానీ కేవలుడను. అద్వితీయుడను.

ఎక్కడికీ వెళ్ళడం, ఎక్కడినుండీ రావడం వంటి అగత్యం లేక,

విశ్వం అంతటా వ్యాపించి ఉన్న నాకు ఇవే దణ్ణాలు!



అహో అహం నమో మహ్యం ఏకోఽహం దేహవా నపి |

క్వచి న్న గన్తా నాగన్తా వ్యాప్య విశ్వ మవస్థితః || 2-12 ||

ఆహా! ఆద్భుతం నేను!

ఇక్కడ నా అంత దక్షులు ఎవరూ లేరు.

ఏదీ అంటని, దేన్నీ తాకని ఈ నా నిరాకారశరీరంతో

చిరకాలంగా ఈ విశ్వాన్నంతా ఎత్తి పట్టి ధరిస్తున్నాను.

అట్టి నాకు ఇవే దణ్ణాలు!

---

అహో అహం నమో మహ్యం దక్షో నా స్తీహ మత్సమః |

అసంస్పృశ్యశరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్ || 2-13 ||

ఓహో నేను! ఆహా నాకు దణ్ణాలు!

కించిత్తు కూడా 'నాది' అన్నది లేనివాణ్ణి.

ఉందీ అనుకుంటే,

నా మనస్సుకూ మాటలకూ అందేదంతాకూడా నా ఆస్తే కదా!

అట్టి ప్రభువునైన నాకు దణ్ణాలు!



---

అహో అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన |

అథవా యస్య మే సర్వం య ద్వాఙ్మనసగోచరమ్ || 2-14 ||

తెలియదగినదీ, తెలుసుకొనేవాడు, తెలుసుకోవటం—

ఈ త్రితయము వాస్తవానికి లేదు.

నాలో అజ్ఞానం చేత ఈ మూడూ ఉన్నట్టుగా అగుపిస్తాయి.

నిజానికి ఏ మలినమూ మచ్చా లేని నిరంజనుడను నేను.



---

జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవమ్ |

అజ్ఞానా ద్భాతి య త్రేదం సోఽహ మస్మి నిరంజనః || 2-15 ||

దుఃఖానికి మూలం ద్వైతభావం.

దీనికి ఒక్కటే మందు.

కనిపించే దృశ్య మంతాకూడా శుష్కమనీ,

నిజంగా ఉన్నదల్లా కేవలం

చైతన్యపుంజమునైన, అమలుడనైన నేనొక్కడనే ననీ

తెలుసుకోవడం తప్ప వేరే మందు లేదు.



ద్వైతమూల మహో దుఃఖం నాన్యత్తస్యాఽస్తి భేషజమ్ |

దృశ్య మేత న్మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః || 2-16 ||

"అజ్ఞానంచేత ఈ శరీర మనే ఉపాధిని, వ్యక్తి అనే ఉపాధిని

కల్పించుకుంటున్నాను. నిజానికి నేను వట్టి ఎఱుకనే"

అని విడమరచుకున్న నాకు ఎప్పుడూ నిర్వికల్పస్థితే కదా!

---

బోధమాత్రోఽహ మజ్ఞానా దుపాధిః కల్పితో మయా |

ఏవం విమృశతో నిత్యం నిర్వికల్పే స్థితి ర్మమ || 2-17 ||

నా కసలు బంధమూ లేదు, మోక్షమూలేదు.

భ్రాంతికూడా, నేను ఆశ్రయం ఇవ్వకపోవటంచేత,

తొలగిపోయింది.

ఆశ్చర్యం! నాలోని విశ్వం కూడా

వాస్తవానికి నాలో లేనేలేదు!

---

న మే బన్ధోఽస్తి మోక్షో వా భ్రాన్తిః శాన్తో నిరాశ్రయా |

అహో మయి స్థితం విశ్వం వస్తుతో న మయి స్థితమ్ || 2-18 ||

నా శరీరంతో సహా ఈ విశ్వం అంతాకూడా

రిక్తమైనదని నిశ్చయంగా తెలిసింది.

ఆత్మకూడా పూర్తిగా ఎటుక మాత్రమే అని తెలిసిపోయింది.

మరిప్పు డింకా కల్పనలకు తావేది?

---

సశరీర మిదం విశ్వం న కించి దితి నిశ్చితమ్ |

శుద్ధచిన్మాత్ర ఆత్మా చ త త్కస్మిన్ కల్పనాఽధునా || 2-19 ||

శరీరమూ, స్వర్గనరకాలూ, బంధమోక్షాలూ, భయమూ –

ఇదంతా కూడా వట్టి కల్పన మాత్రమే.

సత్యమైన చైతన్యాన్నైన నాకు వీటితో ఏం పని?

---

శరీరం స్వర్గనరకౌ బన్ధమోక్షౌ భయం తథా |

కల్పనామాత్ర మే వైతత్ కిం మే కార్యం చిదాత్మనః || 2-20 ||

అడవిలాగ కిటకిటలాడే జనసమూహంలోకూడా, నాకు

అంతటా నేనేతప్ప ఇతరమైన రెండో వస్తువు కనిపించటంలేదు.

ఆశ్చర్యం!

మరింక నేను వ్యామోహంలో పడిపోవడానికి ఏముందిగాక?

---

అహో జనసమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ |

అరణ్య మివ సంవృత్తం క్వ రతిం కరవా ణ్యహమ్ || 2-21 ||

నేను దేహాన్నికాను. దేహం నాది కాదు. నాకు దేహం లేదు.

నేను జీవుడను కాను. చైతన్యరూపమైన ఎఱుకనే.

ఒక జీవిలాగ జీవితం మీద ఇచ్ఛ కలిగి ఉండటమే

నాకు బంధమై యుండినది.

---

నాహం దేహో న మే దేహో జీవో నాహ మహం హి చిత్ |

అయ మేవ హి మే బన్ధ ఆసీ ద్యా జీవితే స్పృహా || 2-22 ||

అబ్బ! అనంత మహాసాగరమైన నాయందు

తలపులనే గాలి బయల్దేరడంతో

విచిత్రమైన భువనకల్లోలాలు చెలరేగుతాయి కదా!

---

అహో భువనకల్లోలై ర్విచిత్రై ర్ద్రాక్ సముత్థితమ్ |

మ య్యనంతమహాంభోధౌ చిత్తవాతే సముద్యతే || 2-23 ||

అనంతమహాసాగర మైన నాయందు

తలపులనే ఈదురుగాలి శాంతించగానే

జీవుడనే వర్తకుడూ, జగత్తనే అతని నౌకా

రెండూకూడా వినాశం చెందుతున్నాయి పాపం!

---

మ య్యనంతమహాంభోధౌ చిత్తవాతే ప్రశామ్యతి |

అభాగ్యా జ్జీవవణిజో జగత్పోతో వినశ్వరః || 2-24 ||

ఆశ్చర్యం! తీరంలేని అనంతమహాసాగర మైన నా యందు

జీవులనే అలలు

తమ ప్రకృతికి అనుగుణంగా లేస్తున్నాయి,

తగులుకుంటున్నాయి, ఆడుకుంటున్నాయి,

చివరికి పడుతున్నాయి.



---

మ య్యనన్తమహాంభోధా వాశ్చర్యం జీవవీచయః |

ఉద్యన్తి ఘ్నన్తి ఖేలన్తి ప్రవిశన్తి స్వభావతః || 2-25 ||

ఇతి ద్వితీయోధ్యాయః

అష్టావక్రు డన్నాడు –

“నాలోని ‘నేను’ అన్న స్ఫురణే

వినాశమే లేనిదీ, కేవలసత్యమూ ఐన ఆత్మ” అని

యథాతథంగా తెలుసుకున్నాక అట్టి ఆత్మజ్ఞుడు

ఇంక ధనసముపార్జన వెంట ఎందుకు వేలాడతాడు?

---

*తృతీయోధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

అవినాశిన మాత్మానం ఏకం విజ్ఞాయ తత్త్వతః |

త వాత్మజ్ఞస్య ధీరస్య కథ మర్థార్జనే రతిః || 3-1 ||

అజ్ఞానంవల్ల ముత్యపుచిప్పలో ఉన్నదాన్ని వెండి అనుకుని

భ్రమపడి ప్రలోభపడ్డట్టే,

అంతరంగంలోని ఆత్మను తెలియకపోవడంచేతనే

బయట ప్రాపంచిక విషయాలున్నట్టు భ్రమపడడమూ,

వాటిని మోహించడమున్నూ.

---

ఆత్మాజ్ఞానా దహో ప్రీతి ర్విషయభ్రమగోచరే |

శుక్తే రజ్ఞానతో లోభో యథా రజతవిభ్రమే || 3-2 ||

"సముద్రం నుండి తరంగాలు లేచి వేరుగా అగుపించినట్లు,

నాలోనుంచే ఈ విశ్వం పుట్టి వేరుగా, నిజంలా అగుపిస్తోంది"

అని తెలిసిన తరువాత కూడా,

నీవు దీనుడిలాగ అటూ ఇటూ పరిగెడతావు దేనికీ?

---

విశ్వం స్ఫురతి య త్రేదం తరఙ్గా ఇవ సాగరే |

సోఽహమ స్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి || 3-3 ||

అతి సుందరమూ, శుద్ధచైతన్యమే అయిన ఆత్మగురించి,

– అంటే తమ స్వస్వరూపాన్ని గురించి – విన్నాక కూడా

కామసుఖాలపట్ల అత్యంత ఆసక్తికి లొంగడంతో

అశుద్ధతను అంటించుకుంటారు కదా!

---

శ్రుత్వాపి శుద్ధచైతన్య మాత్మాన మతిసున్దరమ్ |

ఉపస్థేఽత్యన్తసంసక్తో మాలిన్య మధిగచ్ఛతి || 3-4 ||

అన్ని జీవరాశులలోను తన ఆత్మస్వరూపాన్ని,

తనలో అన్ని జీవాత్మలను

చూడగలిగిన మునిపుంగవుడు కూడా

ఇంకా మమకారాన్ని పట్టి ఉండటం ఆశ్చర్యం!

---

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని |

మునే ర్జానత ఆశ్చర్యం మమత్వ మనువర్తతే || 3-5 ||

పరమ అద్వైతభావం కలిగి, మోక్షం కోసం కృషిచేస్తూకూడా,

కామానికి లొంగి అశ్లీలమైన అలవాట్లకి పాలవడం ఆశ్చర్యమే!

---

ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః |

ఆశ్చర్యం కామవశగో వికలః కేలిశిక్షయా || 3-6 ||

అవసానకాలం వచ్చి, మనిషికి జవసత్వా లుడిగినాక కూడా,

తెలిసి తెలిసి, జ్ఞానార్జనకు శత్రువైన కామసుఖాలకి

అర్రులు చాచడం ఆశ్చర్యం!

---

ఉద్భూతం జ్ఞానదుర్మిత్ర మవధా ర్యాతిదుర్బలః |

ఆశ్చర్యం కామ మాకాంక్షేత్ కాల మన్త మనుశ్రితః || 3-7 ||

ఐహిక, ఆముష్మిక ఫలభోగాల రెండిటియందూ వైరాగ్యం కలిగి,

ఏది నిత్యం ఏది అనిత్యం అన్న వివేకం కలిగి

మోక్షాన్నే కోరేవాడు

ఆ మోక్షాన్నే తలచి భయపడటం ఆశ్చర్యమే!

---

ఇహాముత్రవిరక్తస్య నిత్యానిత్యవివేకినః |

ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షా దేవ బిభీషికా || 3-8 ||

జ్ఞానం కలిగినవాడైతే, ఎల్లప్పుడూ

ఉన్నదల్లా తన ఆత్మేనని తెలుసుకోవడం చేత

భోగాలకి పొంగిపోడు. కష్టాలకి మండీ పడడు.

---

ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా |

ఆత్మానం కేవలం పశ్యన్ న తుష్యతి న కుప్యతి || ౩-౨ ||

పనిపాటలు సాగిస్తున్నప్పుడుకూడా,

తన స్వంతదేహాన్ని తాననుకోక

అన్యవస్తువుగా భావించగలిగే మహాత్ముడు

పొగడ్తలకీ, తెగడ్తలకీ ఎలా క్షోభ చెందుతాడు?

ఎందుకు విచలితు డౌతాడు?

---

చేష్టమానం శరీరం స్వం పశ్య త్యన్యశరీరవత్ |

సంస్తవే చాపి నిన్దాయాం కథం క్షుభ్యేత్ మహాశయః || 3-10 ||

ఈ జగమంతా వట్టి మాయ అని తెలిసి,

దానిపట్ల ఆసక్తి వీడిన స్థిరమనస్కుడికి,

మృత్యువు దగ్గరపడ్డాకూడా ఏం భీతి కలుగుతుంది?

---

మాయామాత్ర మిదం విశ్వం పశ్యన్ విగతకౌతుకః |

అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః || 3-11 ||

నిరాశాజనకమైన పరిస్థితుల్లో కూడా

మనస్సులో కొరతా కోరికా లేకుండా,

ఆత్మజ్ఞానసంతృప్తితోనే నిండి ఉండే మహాత్ముని

ఎవరితో పోల్చిచూపగలము?

---

నిఃస్పృహం మానసం యస్య నైరాశ్యేఽపి మహాత్మనః |

త స్యాత్మజ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే || 3-12 ||

ఈ కనిపించేదంతాకూడా

స్వభావతః రిక్తమైనదని తెలుసుకున్న ధీరమనస్కుడికి

"ఇది స్వీకరించ దగింది, ఇది తిరస్కరించ వలసింది"

అన్న భేదాలు ఎందుకు కనిపిస్తాయి? (కనిపించవు)

---

స్వభావా దేవ జానానో దృశ్య మేత న్న కించన |

ఇదం గ్రాహ్య మిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః || 3-13 ||

తన మనస్సులో వ్యామోహాలను త్యజించి,

ద్వంద్వాల కతీతుడై, కోరికలు లేనివాడు

ఏది దొరికితే అదే పొంది అనుభవిస్తాడు కాని,

ఇది దుఃఖాన్నిచ్చేది, ఇది సంతోషాన్నిచ్చేది

అని ఎంపికలు చేస్కోడు.



---

అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వన్ద్వస్య నిరాశిషః |

యదృచ్ఛయా గతో భోగో న దుఃఖాయ న తుష్టయే || 3-14 ||

ఇతి తృతీయోధ్యాయః

అష్టావక్రు డన్నాడు-

ఈ సంసారమోహంలోపడి బెంబేలు పడుతున్న మృగతుల్యులకీ,

ఆత్మజ్ఞానం కలిగి జీవితాన్ని ఒక ఆటగా సరదాగా నడిపే ధీరులకీ

పాపం, అసలు పోలికే లేదు కదా!

---

*చతుర్థోధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

హ న్తాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా |

న హి సంసారవాహీకై ర్మూడైః సహ సమానతా || 4-1 ||

ఓహో! ఏ కైవల్యపదం కోసం ఇంద్రాది సకలదేవతలు సహితం

దీనంగా పాకులాడుతారో,

అట్టి కైవల్యానందంలోనే ఉంటూకూడా,

యోగియైనవాడు (పరమాత్మతో సాయుజ్యా న్నందిన వాడు)

గొప్పలకి పోడు, హర్షంతో పొంగిపోడు.

---

యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః |

అహో తత్ర స్థితో యోగీ న హర్ష ముపగచ్ఛతి || 4-2 ||

ఆకాశాన్ని పొగ అంటుతున్నట్టు కంటికి కనిపిస్తూన్నా

నిజానికి అంటదు.

అదే విధంగా, ఆ కైవల్యా న్నెరిగినవాని మనస్సుని

పుణ్యపాపాల తలపులు అంటనే అంటవు.

---

తజ్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శో హ్యన్త ర్నజాయతే |

న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానాపి సఙ్గతిః || 4-3 ||

ఈ జగత్తంతా కూడా ఆత్మే అని తెలుసుకున్న మహాత్ముడు

తనకి తోచినట్టు జీవితం గడుపుతాడు.

అతని స్వచ్ఛంద వర్తనాన్ని ఎవ రాపగలరు?

---

ఆత్మై వేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా |

యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః || 4-4 ||

తన సత్యాన్ని తెలుసుకున్న విజ్ఞు డొక్కడే

రాగద్వేషాలను, ఇష్టానిష్టాలను వదిలిపెట్టగల సమర్థుడు.

బ్రహ్మదేవుడినుండి పచ్చగడ్డిదాకా నిండియున్న ఈ సృష్టిలోని

చతుర్విధ చరాచరాల్లో వేరెవ్వరికీ ఇది సాధ్యం కానేరదు.

---

ఆబ్రహ్మాస్తంబపర్యన్తే భూతగ్రామే చతుర్విధే |

విజ్ఞ స్యైవ హి సామర్థ్య మిచ్ఛానిచ్ఛావివర్జనే || 4-5 ||

'నే నున్నాను' అన్న స్ఫురణయైన ఆత్మ ఒక్కటే ఉన్నదనీ,

అదే ఈ జగత్తు నంతా పాలించే దేముడనీ

తెలిసినవాడు చాలా అరుదు.

అట్టివాడు, తనకు తెలిసినట్టు తాను వ్యవహరిస్తాడు.

మరి దేనిని గురించీ బెరుకు పడడు.



---

ఆత్మాన మద్వయం కశ్చి జ్జానాతి జగదీశ్వరమ్ ।

య ద్వేత్తి త త్కురుతే న భయం తస్య కుత్రచిత్ ॥ 4-6 ॥

ఇతి చతుర్థోధ్యాయః

నీదంటూ, నిన్ను అంటేది ఏదీ లేదు.

అటువంటి శుద్ధమైన స్ఫురణమాత్రమైన నువ్వు

ఏదో వదలిపెట్టాలని ప్రయత్నిస్తుంటావేమిటి?

అటువంటి భ్రాంతిని బద్దలగొట్టి,

ఉన్నవాడివి ఉన్నట్లుగానే ఉనికిలో లయం అయిపో, అంతే.

– అని అష్టావక్రుడు బోధిస్తున్నాడు.

---

*పంచమాధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధ స్త్యక్తు మిచ్ఛసి |

సంఘాతవిలయం కుర్వ న్నేవమేవ లయం వ్రజ || 5-1 ||

సముద్రంనీటిలోంచి బుడగలు పుట్టినట్లు,

నీలోంచే ఈ జగత్తు ఉద్భవిస్తోందనీ,

అసలు నిజంగా ఉన్నదల్లా కైవల్యమైన నీ ఆత్మ ఒక్కటేననీ

తెలుసుకుని,

ఉన్నవాడివి ఉన్నట్లుగానే ఉనికిలో లయం అయిపో.

---

ఉదేతి భవతో విశ్వం వారిధే రివ బుద్బుదః |

ఇతి జ్ఞాత్వైక మాత్మానం ఏవ మేవ లయం వ్రజ || 5-2 ||

జగత్తుకు తనదైన ప్రత్యేక వస్తుత్వం లేదు.

అమలుడవైన నీకు వికారాలు లేవు.

అందుచేత, ప్రత్యక్షంగా కనిపిస్తున్నాకూడా

నిజానికి నీలో జగత్తూ అదీ లేదు.

ఈ జగత్తు కనబడటం కూడా,

తాడున్నచోట పాముందని భ్రాంతి పడ్డట్టే అని గ్రహించి

ఉన్నఫళంగా ఉనికిలో కరిగిపో.

---

ప్రత్యక్షమ ప్యవస్తుత్వా ద్విశ్వం నా స్త్యమలే త్వయి |

రజ్జుసర్ప ఇవ వ్యక్తం ఏవ మేవ లయం వ్రజ || 5-3 ||

సుఖాన్నీ దుఃఖాన్నీ, ఆశానిరాశలను, బ్రతుకునీ, మరణాన్నీ,

వీటన్నిటినీ సమానదృష్టితో, సమస్థితిలోంచి చూడగలిగే

పరిపూర్ణుడవైన నీవు, ఉన్నవాడివి ఉన్నట్టుగా ఉనికిగా మిగిలిపో.



---

సమదుఃఖసుఖః పూర్ణ ఆశానైరాశ్యయోః సమః |

సమజీవితమృత్యుః స న్నేవ మేవ లయం వ్రజ || 5-4 ||

ఇతి పంచమాధ్యాయః

అష్టావక్రుడు మళ్ళీ అన్నాడు –

"నేను ఆకాశంవలె అనంతమైన వాణ్ణి.

ఈ జగత్తేమో కుండలాంటిది. పరిమితీ, పరిణతీ గలది"–

అన్న తేడా తెలియడమే జ్ఞానం.

ఇట్టి జ్ఞానమార్గంలో – పట్టుకోవటం, వదిలిపెట్టేయటం,

లయమైపోవడాలూ లేవు.

---

షష్ఠాధ్యాయః

అష్టావక్ర ఉవాచ ||

ఆకాశవ దనన్తోఽహం ఘటవత్ ప్రాకృతం జగత్ |

ఇతి జ్ఞానం త థైతస్య న త్యాగో న గ్రహో లయః || 6–1 ||

“నేను మహాసాగరం లాంటి వాడను.

ఆ ప్రపంచమేమో అల వంటిది”–

ఈ సంబంధం తెలుసుకోవడమే జ్ఞానం.

ఇట్టి జ్ఞానమార్గంలో – పట్టుకోవడం, పరిత్యజించడం,

ఐక్యమైపోవడం, ఇలాంటివి లేవు.

---

మహోదధి ఽ వాహాం స ప్రపంచో వీచిసన్నిభః |

ఇతి జ్ఞానం త థైతస్య న త్యాగో న గ్రహో లయః || 6-2 ||

"'నేను' అన్న స్ఫురణ ముత్యపుచిప్ప వంటిది.

విశ్వం అన్నది కల్పన,

ముత్యపు చిప్పయందలి వెండిరూప్యం వంటిది. మిథ్య" -

ఇదే జ్ఞానం.

ఇందులో ఒకదాన్ని పట్టుకోవటం,

ఒకదాన్ని వదిలిపెట్టడం,

ఇంకోదానిలో లయమైపోవడం లేవు.

---

అహం స శుక్తిసఙ్కాశో రూప్యవద్ విశ్వకల్పనా |

ఇతి జ్ఞానం త థైతస్య న త్యాగో న గ్రహో లయః || 6-3 ||

"నిక్కంగా అన్ని జీవరాశులయందు

'నేను' అన్న స్ఫురణను ఉన్నాను.

అదేవిధంగా,

ఈ నాలో అన్ని చరాచరాలూ రూపుదాల్చి ఉన్నాయి" -

ఇదే జ్ఞానం.

దీనికి – స్వీకరించడం, తిరస్కరించడం, రూపుమాపడం లేవు.



అహం వా సర్వభూతేషు సర్వభూతా న్యథో మయి |

ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః || 6-4 ||

ఇతి షష్ఠాధ్యాయః

జనకు డన్నాడు –

అనంత మహాసముద్రాన్నైన నాలో, ప్రపంచమనే నౌక

తన స్వంతగాలికి తనే తట్టుకోలేక

అటూ ఇటూ ఊగిసలాడుతూంటుంది కానీ

అలా ఊగిసలాడే తత్త్వం నాకైతే లేదు.

---

సప్తమాధ్యాయః

జనక ఉవాచ ||

మ య్యనంతమహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః |

భ్రమతి స్వాంతవాతేన న మమా స్త్యసహిష్ణుతా || 7-1 ||

అనంతమహాసాగరాన్నైన నాలో

జగత్తు అనే అల తన ప్రకృతికి అనుగుణంగా

లేస్తుంది గాక, పడుతుంది గాక.

కాని నాకు మాత్రం ఎదగడం, నశించడం లేవు.

---

మ య్యనంతమహాంభోధౌ జగద్వీచిః స్వభావతః |

ఉదేతు వాఽస్తమాయాతు న మే వృద్ధి ర్న చ క్షతిః || 7-2 ||

అనంతమహాసముద్రాన్నైన నాలో

విశ్వం అన్న కల్పన చెలరేగుతోంది.

అయినా, అతిశాంతుడనూ నిరాకారుడనూ కాబట్టి,

నేను మటుకు అలాగే, రేగకుండా ఉంటాను.

---

మ య్యనంతమహాంభోధౌ విశ్వం నామ వికల్పనా |

అతిశాంతో నిరాకార ఏత దేవాహ మాస్థితః || 7-3 ||

ప్రాపంచిక వస్తుకల్పనలలో ఆత్మ లేదు.

అనంతమైన నిరంజనమైన ఆ ఆత్మలో వస్తువన్నది లేదు.

అందుచేత ఆత్మనైన నేను అసంగుడనై, కోరికలు లేకుండా

శాంతంగా అలాగే ఉంటాను.

---

నాత్మా భావేషు నో భావ స్తత్రానన్తే నిరంజనే |

ఇ త్యసక్తోఽస్పృహః శాన్త ఏత దేవాహ మాస్థితః || 7-4 ||

ఆహో, నేను శుద్ధ చైతన్యమే తప్ప వేరేదీకాను.

ఈ జగత్తేమో వట్టి కనికట్టు వంటిది.

అటువంటప్పుడు, "ఇది చేపట్టదగ్గది, ఇతి మంచిది కాదు"

అనే తలపులు నా కెక్కణ్ణించి వస్తాయి? ఎందుకు వస్తాయి?



అహో చిన్మాత్ర మేవాహం ఇన్ద్రజాలోపమం జగత్ |

అతో మమ కథం కుత్ర హేయోపాదేయకల్పనా || 7-5 ||

ఇతి సప్తమాధ్యాయః

దేనినైనా చూసి వ్యామోహపడటమో, వాపోవటమో,

దేనినైనా వదిలిపెట్టాననో, చేపట్టాననో అనుకోవడమో,

దేన్ని చూసైనా ఉప్పొంగిపోవడమో, ఆక్రోశించడమో –

మనస్సులో ఇటువంటి దేమి జరిగినా అది బంధమే.

కట్టి పడేస్తుంది.

---

*అష్టమాధ్యాయః*

తదా బన్ధో యదా చిత్తం కిన్చిద్వాంఛతి శోచతి |

కిన్చిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి || 8-1 ||

వ్యామోహమూ వాపోవడమూ,

త్యజించడమూ స్వీకరించడమూ, హర్షమూ కోపమూ

లేనప్పుడే మనస్సుకు ముక్తి. విడుపు.

---

తదా ముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి |

న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి || 8-2 ||

మనస్సు ఏదైనా ఒక దృష్టిని (దృష్టికోణాన్ని) పట్టుకుకూర్చుంటే

అది బంధం.

ఏ దృష్టికోణానికీ కూడా తగులుకోకుండా ఉన్నప్పుడే ముక్తి.

మోక్షం.

---

తదా బన్ధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు |

తదా మోక్షో యదా చిత్త మసక్తం సర్వదృష్టిషు || 8-3 ||

"ఈ 'నేను' (కర్త) లేనప్పుడే మోక్షం.

'నేను' అన్న ప్రత్యేక వ్యక్తిభావం ఉన్నప్పుడు బంధమే."

ఇలా అనుకోగలిగినప్పుడే

చేపట్టడాలూ, విడిచిపెట్టడాలూ సులభంగా మానగలవు సుమా!

(చేపట్టేదీ, విడిచిపెట్టేదీ ఈ 'నేనే' కదా.)



---

యదా నాహం తదా మోక్షో యదాహం బన్ధనం తదా |

మత్వేతి హేలయా కించిత్ మా గృహాణ విముంచ మా || 8-4 ||

ఇతి అష్టమాధ్యాయః

“కర్తవ్యపాలన, కర్తవ్యం చెయ్యకపోవడం,

ఇలాంటి ద్వంద్వాలూ, వ్యతిరేకాలూ ఎప్పుడు కడతేరతాయి?

పైగా, ‘ఎవరికి’ కడతేరాలి?”

ఇది గ్రహించి, ఇహం పట్ల వైరాగ్యంచేత త్యాగపరుడవై,

దేనికీ పూనుకోవటం మాని, నిర్లిప్తంగా ఉండు.

— అని అష్టావక్రుడు అన్నాడు.

---

*నవమాధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

కృతాకృతే చ ద్వన్ద్వాని కదా శాన్తాని కస్య వా |

ఏవం జ్ఞాత్వేహ నిర్వేదాద్భవ త్యాగపరోఽవ్రతీ || ౯-1 ||

నాయనా! లోకులపోకడలను చూస్తే, ఎవరికైనా

జీవితేచ్ఛా, భోగాలపై వాంఛా, కుతూహలమూ తగ్గుతాయా?

అటువంటి లోకంపోకడలు పాటించడం చేత

ఎవడైనా ధన్యుడు కాగలడా?

---

కస్యాపి తాత ధన్యస్య లోకచేష్టావలోకనాత్ |

జీవితేచ్ఛా బుభుక్షా చ బుభుత్సోపశమం గతాః || ౯-2 ||

"ఈ సంసారం అంతా నిస్సారం, అనిత్యం, పొగడదగ్గది కాదు. తాపత్రయాలు పుట్టించే దోషంతో నిండినది. తిరస్కరించదగ్గది" అని నిశ్చయించుకున్నవాడు శాంతం చెందుతాడు.

---

అనిత్యం సర్వ మే వేదం తాపత్రయదూషితమ్ |
అసారం నిన్దితం హేయ మితి నిశ్చిత్య శామ్యతి || ౧-౩ ||

మానవజీవితంలో కష్టసుఖాలూ, లాభాలూ, జయాపజయాలూ

అనే ద్వంద్వాలు లేని వయస్సో, అధ్యాయమో ఏదైనా ఉందా?

వాటి గురించి పట్టించుకోక,

ఎలా ప్రాప్తమో అలా బ్రతుకు గడిపేవాడు

జీవితంలో ఉత్తీర్ణుడవుతాడు.

దొరికినదాంతో తృప్తి చెందేవాడే దొర.

---

కోఽసౌ కాలో వయః కిం వా యత్ర ద్వన్ద్వాని నో నృణామ్ |

తా న్యుపేక్ష్య యథాప్రాప్తవర్తీ సిద్ధి మవాప్నుయాత్ || ౧-4 ||

మహర్షులూ, యోగులూ, మతప్రవక్తలూ ఇన్నివిధాల చెప్తూంటే

చూసి, విని, వైరాగ్యం సంపాదించుకుని

శాంతం చెందని వారెవరైనా ఉంటారా?

---

నానా మతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా |

దృష్ట్వా నిర్వేద మాపన్నః కో న శామ్యతి మానవః || ౧-5 ||

తన నిర్లిప్తజీవనంచేత, సమభావం చేత, బుద్ధికౌశలం చేత

మన చైతన్యాన్ని మనకు పరిచయం చేసి,

దాని స్వరూపజ్ఞానాన్ని మనకు కలిగించి

మనని ఈ సంసారం నుండి దాటింపచేసేవాడేకదా గురువు?

---

కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య న కిం గురుః |

నిర్వేదసమతాయుక్త్యా య స్తారయతి సంసృతేః || ౧-౬ ||

పాంచభౌతిక శరీరమూ, ప్రాపంచిక వస్తువులూ

అన్నీకూడా నామరూపాలు ఆపాదించటంవల్ల

వేటికి వాటివలె కనిపిస్తున్నవే గాని,

నిజానికవి పంచభూతాలు మాత్రమే అని గ్రహించు.

అలాగ్రహించిన క్షణమే

నీవు నీ మాయాబంధాన్నుంచి ముక్తుడవై

నీ నిజస్వరూపంలో ఆత్మస్థితుడవౌతావు.

---

పశ్య భూతవికారాం స్త్వం భూతమాత్రాన్ యథార్థతః |

తత్ క్షణా ద్బన్ధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి || ౨-7 ||

పేరుకున్న కోరికలే సంసారం.

అందుచేత కోరికలు వేటికీకూడా పట్టుబడకుండా ఉండు.

పేరుకున్న కోరికల అలవాట్లు మానేయడం వలన

సంసారంపట్టు విడుతుంది.

అది జరిగిన నాడు నీ వింకేమీ చేయనక్కర్లేదు.

ఉన్నట్లుగానే ఉంటే చాలు.



---

వాసనా ఏవ సంసార ఇతి సర్వా విముంచ తాః |

తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా || ౨-౮ ||

ఇతి నవమాధ్యాయః

పురుషార్థాలు నాలుగింట,

కామం నీ శత్రువు. అర్థం అనర్థాలకి దారితీస్తుంది.

ఈ రెండూ విడిచి పెట్టెయ్యి.

ఈ రెండిటా నిన్ను ప్రేరేపించే కారణం ధర్మం.

అంచేత ఆ ధర్మానికి కూడా ఏ విధంగానూ గుడి కట్టేయకు.

---

*దశమాధ్యాయః*

విహాయ వైరిణం కామ మర్థం చానర్థసంకులమ్ |

ధర్మ మ ప్యేతయో ర్హేతుం సర్వ త్రానాదరం కురు || 10-1 ||

మిత్రులు, భూములు, ధనము, ఇళ్ళూ, భార్య, బంధువులూ –

ఈ సంపదనంతాకూడా ఒక కల లాగాను,

లేక, ఒక ఐంద్రజాలికుడి మాయలాగాను పరిగణించి,

మొత్తానికి ఇదంతా మూణ్ణాళ్ళ ముచ్చటే అన్న సత్యాన్ని చూడు.

---

స్వప్నేన్ద్రజాలవత్ పశ్య దినాని త్రీణి పంచ వా |

మిత్రక్షేత్ర ధనాగార దారదాయాది సంపదః || 10-2 ||

ఎక్క డెక్కడైతే తృష్ణ – అంటే,

'ఇది కావాలి' అన్న పిపాస కలుగుతోందో

అక్కడే సంసారం అంటుతోంది అని తెలుసుకో.

దృఢమైన వైరాగ్యాన్ని అలవరచుకుని,

వాంఛలు చల్లారినవాడవై, సుఖంగా ఉండు.

---

యత్ర యత్ర భవే త్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై |

ప్రౌఢవైరాగ్య మాశ్రిత్య వీతతృష్ణః సుఖీ భవ || 10-3 ||

నీకున్న సంకెళ్ళు కోరికలు మాత్రమే.

వాటిని తెంపుకుంటేనే స్వేచ్ఛ – విమోచనం అనబడేది.

ఎప్పటి కప్పుడు, తిరిగి తిరిగి, మరువకుండా

ప్రాపంచిక విషయాల మోజులో పడకుండా ఉండటమే

సంతోషాన్ని కలిగిస్తుంది.

---

తృష్ణామాత్రాత్మకో బన్ధ స్తన్నాశో మోక్ష ఉచ్యతే |

భవాసంసక్తిమాత్రేణ ప్రాప్తి తుష్టి ర్ముహుర్ముహుః || 10-4 ||

నిజంగా ఉన్నదల్లా శుద్ధమైన చైతన్యస్వరూపుడవైన నువ్వొకడవే.

ఈ ప్రపంచమంతాకూడా జడం.

దానికి చైతన్యం లేదు. నిజమైన ఉనికీ లేదు.

అసలు అవిద్య(అజ్ఞానం) అన్నది కూడా ఏదీలేదు.

మరింకా నీకు, ఏదో జ్ఞానం సంపాదించాలన్న పాకులాట దేనికి?

---

త్వ మేక శ్చేతనః శుద్ధో జడం విశ్వ మస త్తథా |

అవిద్యాపి న కించి త్సా కా బుభుత్సా తథాపి తే || 10-5 ||

రాజ్యం, సంతానమూ, భార్యా, శరీరం, సుఖాలు,

వీటన్నిటినీ కూడా ఒక్కొక్క జన్మలోనూ

నువ్వు ఎంత గట్టిగా పట్టుకు కూర్చున్నా

అవన్నీ చివరికి నీనుండి దూరమే అయిపోతూ వచ్చాయి కదా!

---

రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖాని చ |

సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని || 10-6 ||

అర్థమూ, కామమూ, ధర్మమైన పుణ్యకార్యాలూ,

ఇక చాలుబాబూ!

ఈ పురుషార్థ ప్రాపంచికజీవన మనే కీకారణ్యంలో

మనస్సుకు ఎప్పుడూ విశ్రాంతి దొరకనేలేదుకదా.

---

అల మర్థేన కామేన సుకృతేనాపి కర్మణా |

ఏభ్యః సంసారకాన్తారే న విశ్రాన్త మభూ న్మనః || 10-7 ||

ఎన్ని జన్మల బట్టీ నువ్వు మనోవాక్కాయ కర్మల చేత

గొడ్డు చాకిరీ చేస్తూ వచ్చావు!

అదంతా ఇప్పటికైనా ఆపి, విరమించుకుని, ఉపశమించు.



కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా |

దుఃఖ మాయాసదం కర్మ త దద్యా ప్యుపరమ్యతామ్ || 10-8 ||

*ఇతి దశమోధ్యాయః*

వస్తువులకి ఉనికీ, లేమీ, పరిణతీ – ఇవి మూడూకూడా

స్వభావగుణా లని నిర్ధారణగా తెలుసుకున్నవాడు

నిర్వికారుడై (తబ్బిబ్బు కాకుండా) కష్టాలు కడతేరిన వాడై,

సునాయాసంగా ఉపశమనం పొందుతాడు.

---

*ఏకాదశోధ్యాయః*

భావాభావవికారశ్చ స్వభావా దితి నిశ్చయీ |

నిర్వికారో గతక్లేశః సుఖేనైవోపశామ్యతి || 11-1 ||

యావత్ సృష్టికీ నిర్మాత భగవంతుడే,

అతడు తప్ప వేరే ఏ శక్తీ ఇక్కడ లేదని

నిశ్చయంగా అర్థం చేసుకున్నవాడు

అంతరంగంలో కోరికలు మటుమాయమైనవాడై, శాంతుడౌతాడు.

దేనివెంటా పడి తగులుకోడు. పులుముకోడు.

---

ఈశ్వరః సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ |

అన్తర్గళితసర్వాశః శాన్తః క్వాపి న సజ్జతే || 11-2 ||

జీవితంలో ఆపదలూ, సంపదలూ

వాటి వాటి సమయాల్లో వాటిల్లడం

మన ప్రారబ్ధాన్ని బట్టి దైవం నిర్ణయించేదీ

అని తెలివిగా అర్థం చేసుకున్నవాడు,

తన ఇంద్రియాల పోకడ తనలోనే అణిగి ఉండటంచేత

ఎప్పుడూ సంతృప్తిగా ఉంటాడు.

ఏమీ అడగడు. ఏడుపులు ఏడవడు.

---

ఆపదః సంపదః కాలే దైవా దే వేతి నిశ్చయీ |

తృప్తః స్వస్థేన్ద్రియో నిత్యం న వాన్ఛతి న శోచతి || 11-3 ||

సుఖమూ, దుఃఖమూ, పుట్టుకా, మరణమూ,

అన్నీ ప్రారబ్ధానుసారం దైవ నిర్ణయాలే

అని తేటగా తెలుసుకున్నవాడు,

తన స్వంతగొప్పవల్ల సాధ్యమైయేది ఏదీ లేదని కనిపెట్టి

ఆయాసపడకుండా ఉంటాడు.

ఏదన్నా కార్యంలో కృషి చేస్తున్నా గాని,

దాని ఫలంసాధించే పట్టుదలలో, తాపత్రయంలో తగులుకోడు.

---

సుఖదుఃఖే జన్మమృత్యూ దైవా దే వేతి నిశ్చయీ |

సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే || 11-4 ||

ఈ జీవితంలో చింతయే చికాకులకి కారణం, మరేదీ కాదు

అని గట్టిగా గ్రహించినవాడు,

చింతా, బెంగపెట్టుకోవటమూ మాని, చికాకులు పోయి,

దేనిపట్లా వ్యామోహం లేక,

సుఖంగా, శాంతంగా ఉండగలుగుతాడు.

---

చిన్తయా జాయతే దుఃఖం నాన్య థే హేతి నిశ్చయీ |

తయా హీనః సుఖీ శాన్తః సర్వత్ర గళితస్పృహః || 11-5 ||

"నేనీ జడశరీరాన్నికాను. నాకసలు పరిమితం చేసే శరీరమే లేదు.

నేను ఎఱుకను(చైతన్యాన్ని)" అని నిశ్చయంగా గ్రహించినవాడు

కైవల్యసమమైన స్థితినంది,

తానుగాని ఇతరులుగాని చేసినవీ, చేయనివీ అన్నీ పైకిలాగి

అర్థాలు తీసి సాగదీయడు.

---

నాహం దేహో న మే దేహో బోధోఽహ మితి నిశ్చయీ |

కైవల్య మివ సంప్రాప్తో న స్మర త్యకృతం కృతమ్ || 11-6 ||

బ్రహ్మదేవుడినించి పచ్చగడ్డివరకూ ఉన్నదల్లా తానే

అని గ్రహించినవాడు, ఆలోచనలతో సతమతం అవక, పవిత్రుడై,

జీవితంలో తనకి ప్రాప్తమైనవీ ప్రాప్తంకానివీ లెక్కవేసి

బేరీజు వేస్తూ కూర్చోక, శాంతుడై ఉంటాడు.

---

ఆబ్రహ్మస్తంబపర్యన్తం అహ మే వేతి నిశ్చయీ |

నిర్వికల్పః శుచిః శాన్తః ప్రాప్తాప్రాప్తవినిర్వృతః || 11-7 ||

రకరకాలవాటితో నిండి, అచ్చెరువు గొలిపే ఈ ప్రపంచం

అసలు ఉత్తది అని స్పష్టంగా తెలుసుకున్నవాడు,

వాంఛలూ అలవాట్లూ లేనివాడై, స్ఫూర్తియే తానుగా మిగిలి,

బరువూ ప్రత్యేకతా కోల్పోయి, శాంతిస్తాడు.



---

నానాశ్చర్య మిదం విశ్వం న కించి దితి నిశ్చయీ |

నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించి దివ శామ్యతి || 11-8 ||

ఇతి ఏకాదశోధ్యాయః

శారీరకమైన పనులమీద మొదట అసహనం కలిగి

తరువాత, పెద్దపెద్ద మాటలు ఆడటం అంటే విసిగెత్తి

అటుపైన, బొత్తిగా ఆలోచించడం కూడా భారమే అనిపించి,

అలాగే, ఉన్నవాణ్ని ఉన్నట్లుగానే మెదలకుండా కూర్చున్నాను.

— అని జనకు డన్నాడు.

---

*ద్వాదశోధ్యాయః*

జనక ఉవాచ ||

కాయకృత్యాసహః పూర్వం తతో వాగ్విస్తరాసహః |

అథ చిన్తాసహ స్తస్మాత్ ఏవ మే వాహ మాస్థితః || 12-1 ||

బయట శబ్దాది ఇంద్రియవిషయాల వ్యామోహాన్ని దాటాను.

లోపల ఆత్మ సరే, చూసే విషయం కాదు.

అందుచేత, హృదయంలో ఏ దనిపిస్తే అది గమనిస్తూ

అలాగే ఉన్నపాటున ఉంటాను.

---

ప్రీత్యభావేన శబ్దాదే రదృశ్యత్వేన చాత్మనః |

విక్షేపైకాగ్రహృదయ ఏవ మే వాహా మాస్థితః || 12-2 ||

నా ఊహలచేత చెలరేగిన అలోచనలు,

ధ్యానంలో నన్ను భ్రమింపచేసినప్పుడు

మనస్సును సమాధిలో నిలపడానికి

ఏకాగ్రత వంటి ప్రయత్నాలు సలపాలి.

అట్టి భ్రమలు లేనప్పుడు ఏ ప్రయత్నమూ అక్కరలేదు

అన్న విషయం గమనించి, ఏమీ సంకల్పం చేయకుండా

అలాగే ఊరికే కూర్చుంటాను.

---

సమాధ్యాసాదివిక్షిప్తౌ వ్యవహారః సమాధయే |

ఏవం విలోక్య నియమం ఏవ మే వాహా మాస్థితః || 12-3 ||

ఇది స్వీకరణీయము, ఇది తిరస్కరణీయము

(ఇది మంచిదీ, ఇది చెడ్డదీ) అన్న తేడాలు నన్ను వీడిపోయాయి.

పొంగిపోవడమూ, కుంగిపోవడమూ

వంటి ఉద్రేకాలు నాకు లేవు, ఓ బ్రాహ్మణోత్తమా!

అందుచేత నేను అలాగే, ఆ స్థితిలోనే హాయిగా ఉంటాను.

---

హేయోపాదేయవిరహో దేవం హర్షవిషాదయోః |

అభావా దద్య హే బ్రహ్మ న్నేవ మే వాహ మాస్థితః || 12-4 ||

బ్రహ్మచర్యమూ, గార్హస్థ్యమూ వంటి ఆశ్రమ ధర్మాలని

పాటించటమూ, ఆ నియమాలు తప్పటమూ,

ధ్యానం చేయటమూ, మనసుపడ్డదాన్ని వదిలిపెట్టటమూ,

వీటన్నిటివల్లా నా స్ఫూర్తికి భంగం కలగటం చూసి,

నేనుమటుకు అలాగే ఉన్నపాటున ఉంటున్నాను.

---

ఆశ్ర మానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృతవర్జనమ్ |

వికల్పం మమ వీక్ష్యైతై రేవ మే వాహా మాస్థితః || 12-5 ||

కర్మానుష్ఠానం చేయడం అజ్ఞానం అయితే,

చేస్తున్న కర్మలను మానేయడం కూడా అజ్ఞానమే.

అనుష్ఠానం లోని కర్తాభావం అజ్ఞానం.

విరమించడంలోని కర్తాభావం కూడా

కర్తాభావం కావడం చేత అజ్ఞానమే.

ఈ తత్త్వాన్ని సమగ్రంగా తెలుసుకుని,

నేను అలాగే హాయిగా ఉన్నపాటున ఉంటాను.

---

కర్మానుష్ఠాన మజ్ఞానా ద్యథై వోపరమ స్తథా |

బుధ్వా సమ్య గిదం తత్త్వం ఏవ మే వాహ మాస్థితః || 12-6 ||

ఊహింపశక్యంకాని భగవంతుణ్ని,

ఎంత గొప్పగా ఊహించెయ్యగలిగినాకూడా,

ఆ ఊహారూపాన్నే – అంటే

వట్టి ఊహనే కదా మనం అరాధిస్తున్నాము!

అలా బలవంతాన భగవంతుణ్ని ఊహించే భావాలు మాని

నేను అలాగే ఉన్నపాటున కూర్చుంటాను.

---

అచింత్యం చింత్యమానోఽపి చిన్తారూపం భజ త్యసౌ |

త్యక్త్వా త ద్భావనం తస్మా దేవ మే వాహా మాస్థితః || 12-7 ||

ఈ విధంగా ఉన్నపాటున ఉండగలిగే తుష్టిని చేసుకున్నవాడు

కృతార్థుడు.

ఈ విధంగా "ఊరకే" ఉండే స్వభావం గలవాడు

ధన్యుడు.



ఏవ మేవ కృతం యేన స కృతార్థో భవే దసా |

ఏవ మేవ స్వభావో యః స కృతార్థో భవే దసా || 12-8 ||

ఇతి ద్వాదశాధ్యాయః

జనకు డన్నాడు-

ఏమీలేని ఫకీరు పొందే మనశ్శాంతి,

కౌపీనం ధరించి సాధనచేసే సన్యాసికి కూడా దుర్లభము.

అందుచేత, ఈ బాహ్యంగా సంసారాన్ని త్యాగం చెయ్యటం,

సన్యాసాన్ని స్వీకరించటం, వంటి వాటిని మాని

నేను హాయిగా ఉంటాను.

---

*త్రయోదశాధ్యాయః*

జనక ఉవాచ ||

అకించనభవం స్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్ |

త్యాగాదానే విహా యాస్మా దహా మాసే యథాసుఖమ్ || 13-1 ||

కాయకర్మైనా, వాక్ కర్మైనా మనోకర్మైనా –

వీటిలో ఒక్కొక్కటీ ఒక్కొక్క రకంగా మనల్నే కష్టపెడుతూంటాయి.

ఈ కర్మసాధనలన్నీ మాని

ఒక్క మోక్షసాధనలో హాయిగా నిమగ్నుడనై ఉన్నాను.

---

కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే |

మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితః సుఖమ్ || 13-2 ||

నిజంగా ఏ పనీకూడా మనం సంకల్పించి చేసినది కానేరదు

అన్న సత్యాన్ని తలుచుకుని,

ఏది కర్తవ్యంగా నాకెదురుపడితే అది అప్పటికి నిర్వహించి

ఆనందంగా ఉంటాను.

---

కృతం కి మపి నైవ స్యా దితి సంచిన్త్య తత్త్వతః |

యదా యత్కర్తు మాయాతి తత్ కృ త్వాసే యథాసుఖమ్ || 13-3 ||

శరీరమే తాము అనుకునే యోగులు

ఒకచోట కర్మచెయ్యమనో,

ఇంకొకచోట నైష్కర్మ్య స్థితిలో ఉండమనో

నిర్బంధిస్తూంటారు.

కర్తృత్వంతో, కర్మతో సంబంధమూ అసంబంధమూ లేని నేను

అట్టి నిర్బంధాలేవీ లేక నిశ్చింతగా ఉంటాను.

---

కర్మనైష్కర్మ్యనిర్బన్ధభావా దేహస్థయోగినః |

సంయోగాయోగవిరహో దహ మాసే యథాసుఖమ్ || 13-4 ||

ఒక చోట ఉండటంవల్లనో,

సంచారం చేస్తుండడం వల్లనో,

రెండూ మానేసి ఊరికే పడుకునిఉండటం వల్లనో

నాకు అబ్బే మంచిగాని, చెడుగాని ఏమీ లేవు.

అందుచేత నిల్చునే ఉన్నా, పయనిస్తున్నా, నిద్రపోతున్నా,

నేను సంతోషంగానే ఉంటాను.

---

అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా న శయనేన వా|

తిష్ఠన్ గచ్ఛన్ స్వపన్ తస్మా దహ మాసే యథాసుఖమ్ ||13-5||

నిద్రపోతూ ఉండటం వల్ల నాకు నష్టమేమీ లేదు.

కృషి చేయడం వల్ల లాభమూ లేదు.

అందుచేత నష్టమూ, ఉల్లాసమూ అన్న లెక్కలు విడిచిపెట్టి

హాయిగా ఉన్నపాటున సుఖంగా ఉంటాను.

---

స్వపతో నాస్తి మే హానిః సిద్ధి ర్యత్నవతో న వా |

నాశోల్లాసౌ విహా యాస్మా దహ మాసే యథాసుఖమ్ || 13-6 ||

ప్రాపంచిక వస్తుభోగాలవల్ల కలిగే సుఖదుఃఖాలలో

హెచ్చుతగ్గుల పాళ్ళకి ఒక నియమం లేకపోవడంచేత

'ఇది శుభకరము, ఇది అశుభము' అన్న ముద్రవేయడం మాని

సుఖంగా ఉంటాను.



---

సుఖాదిరూపానియమం భావే ష్వాలోక్య భూరిశః |

శుభాశుభే విహా యాస్మా దహ మాసే యథాసుఖమ్ || 13-7 ||

*ఇతి త్రయోదశాధ్యాయః*

ఈ సంసారంలో ఉంటూకూడా

సంసారపు చింతలు క్షీణించినవాడు,

నిద్రపోతూకూడా మెలకువలో ఉన్నటువంటివాడు.

అతనికి ఎప్పుడేనా పరధ్యానం కలిగి

ఆలోచనలు ఒకటీ అరా తలెత్తినా,

స్వభావసిద్ధంగా అతని మనస్సు

ఆలోచనల రణగొణధ్వని లేక ప్రశాంతంగా ఉంటుంది.

— అని జనకు డన్నాడు.

---

*చతుర్దశాధ్యాయః*

జనక ఉవాచ ||

ప్రకృత్యా శూన్యచిత్తో యః ప్రమాదా ద్భావభావనః |

నిద్రితో బోధిత ఇవ క్షీణసంసరణో హి సః || 14-1 ||

కోరికలన్నీ చల్లారి మటుమాయమైపోయిన నాకు,

ఇక ఇంకా మిత్రులూ, ధనమూ,

దాన్ని దోచుకునే ప్రాపంచిక విషయాలూ ఏముంటాయి?

ఇంక శాస్త్రాలేమిటి? జ్ఞానమేమిటి?

---

క్వ ధనాని క్వ మిత్రాణి క్వ మే విషయదస్యవః |

క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గలితా స్పృహా || 14-2 ||

జగదీశ్వరుడూ, అన్నిటినీ గమనిస్తున్నవాడూ,

అయిన పరమాత్మని తెలుసుకున్నాక,

బంధమూ మోక్షమూ అన్న చర్చల మీద ఇచ్ఛ మాని

ఇక నాకు ముక్తి దొరకాలన్న ఆదుర్దా కూడా లేదు.

---

విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే |

నైరాశ్యే బంధమోక్షేచ న చింతా ముక్తయే మమ || 14-3 ||

నిర్వికల్పమైన అంతరంగం గలవాడు

బయటికి స్వసంకల్పంతోనే మసులుతున్నట్లు కనపించినా,

అతని బతుకు కలలోలాగే జరిగిపోతూంటుంది.

అటువంటి దశలోఉన్నవాని లోపలి స్థితిగతులు,

అతనివంటి అంతరంగశుద్ధత గలవాళ్ళకే గాని

ఇతరులకి తెలియదు.



---

అంతర్వికల్పశూన్యస్య బహిః స్వచ్ఛన్దచారిణః |

భ్రాన్త స్యేవ దశా స్తాస్తా స్తాదృశా ఏవ జానతే || 14-4 ||

ఇతి చతుర్దశాధ్యాయః

అష్టావక్రు డన్నాడు –

సత్త్వబుద్ధిగల ముముక్షువులకైతే

జీవితధ్యేయమైన ముక్తి పొందటానికి

ఊరికే యాదాలాపంగా చేసిన ఉపదేశమే చాలు.

జిజ్ఞాసువులు జ్ఞానసముపార్జనకోసం

ఉపదేశాలవెంట జీవితమంతా వెచ్చించినా

జ్ఞానమోహంలోనే చిక్కుకుని ఉంటారు.

---

*పంచదశాధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

యథాతథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్ |

ఆజీవ మపి జిజ్ఞాసుః పర స్తత్ర విముహ్యతి || 15-1 ||

బంధం అంటే

సుఖంకోసం ప్రాపంచికవిషయాల వెంటపడవలసి రావడం.

మోక్షం అంటే

మన సుఖశాంతులకై ప్రాపంచిక విషయాల వెంటపడవలసిన

అగత్యం లేకపోవటం.

తెలుసుకోవలసిన వేదాంతరహస్యమల్లా ఇంతే.

ఇక నీకు ఎలా తోచితే అలా చెయ్యి.

---

మోక్షో విషయవైరస్యం బన్ధో వైషయికో రసః |

ఏతావ దేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు || 15-2 ||

ఈ తత్త్వజ్ఞానం వాచాలుర్ని మూగిగానూ,

తెలివిగలవారిని జడబుద్ధిగానూ,

శ్రామికులను బద్ధకస్తులుగానూ మార్చేస్తుంది.

అంచేత, ప్రపంచభోగాలను అనుభవించాలన్న కోరిక గలవారు

ఈ తత్త్వజ్ఞానబోధ జోలికి రారు.

---

వాగ్మి ప్రాజ్ఞ మహోద్యోగం జనం మూకజడాలసమ్ |

కరోతి తత్త్వబోధోఽయ మత స్త్యక్తో బుభుక్షుభిః || 15-3 ||

నీవు దేహానివి కావు.

నీకు పరిమితంచేసే దేహమూ లేదు.

నీవు పనులను చేసే కర్తవీ కావు,

ఆ పనుల ఫలాల ననుభవించే భోక్తవీ కావు.

నీవు చైతన్యస్వరూపుడివి.

సదా సాక్షిగానే ఉండేవాడివి.

దేనినీ అపేక్షించక సుఖంగా తిరుగాడు.

---

న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్ |

చిద్రూపోఽసి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర || 15-4 ||

రాగద్వేషాలు మనస్సుకు చెందినవి. నీకు కాదు.

మనస్సు నీకు చెందినది కాదు. నీది కాదు.

నువ్వు తేడాలూ భేదాలూ లేనివాడివి.

మార్పులు చెందనివాడివి .

“ఉన్నాను” అన్న స్ఫురణవే నువ్వు.

సుఖంగా తిరుగాడు.

---

రాగద్వేషా మనోధర్మా న మన స్తే కదాచన |

నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికారః సుఖం చర || 15-5 ||

అందరిలోనూ నిన్నూ, నీలో అందరినీ

చూడడం నేర్చుకుని,

నీ అల్పమైన వ్యక్తిని పట్టి ఉండక,

'నాది నాది' అన్న పాకులాట వీడి,

హాయిగా తేలికగా ఉండు.

---

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని |

విజ్ఞాయ నిరహంకారో నిర్మమ స్త్వం సుఖీ భవ || 15-6 ||

సముద్రంలో అలలు ఏర్పడి వేరుగా కనిపిస్తాయి.

ఓ చైతన్యమూర్తీ !

అదేవిధంగా నీ స్ఫురణలోంచే ఈ విశ్వం ఉదయిస్తోంది.

ఆ స్ఫురణవే నీవు. ఇందులో సందేహం లేదు. బెంగ పడకు.

---

విశ్వం స్ఫురతి య త్రేదం తరంగా ఇవ సాగరే |

త త్త్వ మేవ న సన్దేహ శ్చిన్మూర్తే విజ్వరో భవ || 15-7 ||

జ్ఞానమే రూపుదాల్చినవాడివి. భగవంతుడవు నువ్వు.

జడమైన, గుణదోషాలతో నిండిన ప్రకృతివి కావు.

దానికి అతీతమైన ఆత్మవు.

విను బాబూ! నమ్ము నాయనా!

ప్రాకృతికమైన ఈ ప్రపంచపు మోహంలో పడకు సుమా!

---

శ్రద్ధస్వ తాత శ్రద్ధస్వ నాత్ర మోహం కురుష్వ భోః |

జ్ఞానస్వరూపో భగవా నాత్మా త్వం ప్రకృతేః పరః || 15-8 ||

పంచేంద్రియాల సంకెళ్ళ చిక్కిన ఈ దేహం

అవి నిలబడమంటే నించుంటుంది,

రమ్మంటే వస్తుంది, పొమ్మంటే పోతుంది.

కాని, నీ అసలు స్వరూపమైన ఆత్మ

వచ్చేదీ కాదు, పోయేదీ కాదు.

మరెందుకు దాన్ని గురించి విచారిస్తావు?

---

గుణైః సంవేష్టితో దేహ స్తిష్ఠ త్యాయాతి యాతి చ |

ఆత్మా నగంతా నాగంతా కి మేన మనుశోచసి || 15-9 ||

దేహం కల్పాంతం వరకూ బతికి ఉండనీ,

లేదా, ఇప్పటికిప్పుడే రాలిపోనీ.

చైతన్యమే స్వరూపముగా గల నీకు

దేహం చిరకాలం ఉండటం వల్ల కలిగే వృద్ధిగానీ,

అ దిప్పుడే రాలిపోవడం వల్ల నష్టంగానీ

ఏమున్నది?

---

దేహ స్తిష్ఠతు కల్పాన్తం గచ్ఛత్వ ద్యైవ వా పునః |

క్వ వృద్ధిః క్వ చ వా హాని స్తవ చిన్మాత్రరూపిణః || 15-10 ||

అనంత మహాసాగరం వంటివాడవైన నీలో జగత్తు అనే అల

తన ప్రకృతికి అనుగుణంగా లేస్తుంది గాక, పడుతుందిగాక.

కాని దానివల్ల, నీకు పెరుగుట, తరుగుట లేవు.

---

త్వ య్యనంతమహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః |

ఉదేతు వాస్తమాయాతు న తే వృద్ధి ర్న వా క్షతిః || 15-11 ||

నాయనా! వట్టి ఎఱుకయే నీ స్వరూపము.

నీ ఎఱుకలోని ఈ జగత్తు నీనుండి భిన్నం కాదు.

మరి అలాంటప్పుడు,

జగత్తులో 'ఏది స్వీకరించదగ్గది? 'ఏది తిరస్కరణీయము?

ఈ ద్వంద్వ కల్పన ఎవరికి? ఎలాగ కలగగలదు?

---

తాత చిన్మాత్రరూపోఽసి న తే భిన్న మిదం జగత్ |

అతః కస్య కథం కుత్ర హేయోపాదేయకల్పనా || 15-12 ||

ఉన్నదల్లా అద్వయుడవైన నువ్వు ఒక్కడవే!

నాశం లేనివాడివి. శాంతుడవు.

చైతన్య విస్తారానివి. అమలుడవు.

అటువంటి నీయందు

జన్మగాని, కర్మగాని, అహంకారంగాని

ఎక్కడనుండి ఏర్పడగలదు?

---

ఏకస్మి న్నవ్యయే శాన్తే చిదాకాశేఽమలే త్వయి |

కుతో జన్మ కుతో కర్మ కుతోఽహంకార ఏవ చ || 15-13 ||

నువ్వు దేనిని చూసినా, నీ దృష్టి దేనిమీద పడ్డా

అక్కడ ప్రకాశించేది అద్వయుడవైన నువ్వే.

బంగారు గాజులూ, వొంకీలూ, గజ్జెలూ

బంగారంగానే మెరుస్తుంటాయి గాని,

బంగారానికి భిన్నంగా కనిపిస్తాయా?

---

యత్త్వం పశ్యసి తత్రైక స్త్వమేవ ప్రతిభాససే |

కిం పృథక్ భాసతే స్వర్ణాత్ కటకాంగదనూపురమ్ || 15-14 ||

'నేను బ్రహ్మతత్త్వాన్ని, ఆత్మను' అన్న జ్ఞానాన్నీ,

'నేను జడాన్ని కాను, అనాత్మయైన ప్రపంచాన్ని కాను'

అన్న వివేకాన్నీ

వేరు వేరు సిద్ధాంతాల కింద విభజించక,

'ఉన్నదల్లా ఒక్కటే, ఉన్నదంతా ఆత్మయే' అని రూఢిచేసుకుని,

సిద్ధాంతసంకల్పాలు లేక సంతోషంగా ఉండు.

---

అయం సోఽహ మయం నాహం విభాగ మితి సంత్యజ |

సర్వ మాత్మేతి నిశ్చిత్య నిస్సఙ్కల్పః సుఖీ భవ || 15-15 ||

ఈ ప్రపంచం ఉన్నట్లుగా కనిపించడం

కేవలం నీ అజ్ఞానం వల్ల తోచినదే కాని నిజం కాదు.

అజ్ఞానంతో కాక పారమార్థిక దృష్టితో చూస్తే

నిజానికి ఉన్నదల్లా నీ వొక్కడవే.

సంసారంలో చిక్కుకున్న గృహస్థుడైనా,

సంసారాన్ని త్యజించిన సన్యాసియైనా,

జీవుడైనా ఈశ్వరుడైనా, మరేదైనా

అన్నీ నువ్వేగాని వేరే ఎవరూ ఇక్కడ లేరు.

---

తవై వాజ్ఞానతో విశ్వం త్వ మేకః పరమార్థతః |

త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాసంసారీ చ కశ్చన || 15-16 ||

'ఈ ప్రపంచమూ, సంసారమూ వట్టి భ్రమ,

నిజానికి ఇదంతా ఏమీ లేదు'

అని నిశితంగా గ్రహించినవాడు,

కోరికలు చోటుచేసుకోలేని వట్టి ఎఱుకమాత్రుడనన్న

అనుభవంలో, ఏమీ కానట్టే శాంతంగా ఉంటాడు.

---

భ్రాన్తిమాత్ర మిదం విశ్వం న కించి దితి నిశ్చయీ |

నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించి దివ శామ్యతి || 15-17 ||

ఈ సంసారమనే సముద్రంలో

ఇదివరకు ఉండినదల్లా ఒక్కటే.

ఇప్పుడూ ఉన్నది ఒక్కటే.

ఇకపై కూడా ఒక్కటే ఉండబోయేది

(నానాత్త్వం అన్నది లేనిది).

నీ కంటావా,

సంక్రమించిన బంధమూ లేదు,

సంపాప్తించవలసిన మోక్షమూ లేదు.

కృతకృత్యుడివి.

నీకు చేసేందుకు తరువాయి ఏమీలేదు.

హాయిగా మసలుతూండు.

---

ఏక ఏవ భవాంభోధా వాసీ దస్తి భవిష్యతి |

న తే బన్ధోఽస్తి మోక్షో వా కృత్యకృత్యః సుఖం చర || 15-18 ||

హే చైతన్యమయా! (నిన్నే)

సంకల్పాలతోటీ, వికల్పాలతోటీ నీ చిత్తాన్ని క్షోభ పెట్టకు.

ఉపశమనంతో సేదతీరి,

ఆనందమూర్తియైన నీ ఆత్మలోనే ఆదమరచి ఉండు.

---

మా సఙ్కల్పవికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ |

ఉపశామ్య సుఖం తిష్ఠ స్వాత్మ న్యానన్దవిగ్రహే || 15-19 ||

దేనిమీదైనా కూడా ధ్యానం చేయడం అదీ మానెయ్యి.

హృదయంలో ఏదీ కూడా ధారణపట్టి కూర్చోకు.

నువ్వు ఆత్మవి. ముక్తుడవే.

ఇంకా విచారమార్గమూ అదీ పట్టి ఏం చేస్కుంటావు?



---

త్య జైవ ధ్యానం సర్వత్ర మా కించి ద్ధృది ధారయ |

ఆత్మా త్వం ముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి || 15-20 ||

ఇతి పంచదశాధ్యాయః

నాయనా!

నీవు నానాశాస్త్రాలనూ పలువిధాల

ప్రవచిస్తూ ఉండేవాడివి కావచ్చు.

లేక పలువురి వద్ద శ్రవణం చేస్తూండేవాడివి కావచ్చు.

ఇ వెన్నిచేసినా, పలికినవీ –విన్నవీ అన్నీ మర్చిపోతేకానీ

నీకు ఆత్మనిష్ఠ లభించదు.

–అని అష్టావక్రు డన్నాడు.

---

షోఢశాధ్యాయః

అష్టావక్ర ఉవాచ ||

ఆచక్ష్వ శృణు వా తాత నానాశాస్త్రా ణ్యనేకశః |

తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణా దృతే || 16-1 ||

మహానుభావా!

నువ్వు వట్టి భోగివైనాకానీ,

పవిత్రమైన కర్మఠుడవైనాకానీ,

సమాధి అభ్యసించే యోగివైనాకానీ,

నీ చిత్తం మటుకు

ధర్మార్థకామాలకి అతీతమైనదాన్నే,

ఈ పురుషార్థాలన్నిటిపై కోరికల నధిగమించిన స్థితినే

అభిలషిస్తుంది. ఆరాధిస్తుంది.

---

భోగం కర్మ సమాధిం వా కురు విజ్ఞ తథాపి తే |

చిత్తం నిరస్తసర్వాశ మత్యర్థం రోచయిష్యతి || 16-2 ||

సాధనలో స్వప్రయత్నం చేర్చడం వల్లనే

అందరూ ఆధ్యాత్మికతలో క్లిష్టత ననుభవిస్తున్నారు.

కానీ ఎవరూ ఈ సంగతినర్థం చేసుకోవటం లేదు.

ఈ ఒక్క కిటుకు తెలుసుకుని – అంటే ప్రయత్నం జోరు మాని,

నిర్వాణాన్ని ప్రాప్తించగలవాడు ధన్యుడు.

---

ఆయాసా త్సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన |

అనే నై వోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్ || 16-3 ||

సాధనలమాట అటుంచు.

'రెప్ప వెయ్యడం, ఎత్తడం కూడా పెద్ద ప్రయత్నమే'

అనిపించేంత బద్ధకంలోని రహస్యం తెలిసిన నిపుణులకే

ఆనందరసం అనుభవ మౌతుంది.

వేరే తక్కిన ఎటువంటి సాధకులకీ ఇది లభ్యం కాదు.

---

వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయో రపి |

త స్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్ || 16-4 ||

‘ఇది సాధించాను, ఇదింకా సాధించాల్సి ఉంది’

అన్న ద్వంద్వభేదాలు మనస్సులో ఎప్పుడైతే సమసిపోతాయో,

అప్పుడే మనస్సు ధర్మార్థకామమోక్షాల వేటనుంచి

విడుపు నందుతుంది.

---

ఇదం కృత మిదం నేతి ద్వంద్వై ర్ముక్తం యదా మనః |

ధర్మార్థకామమోక్షేషు నిరపేక్షం తదా భవేత్ || 16-5 ||

విరక్తిని అభ్యసించే బైరాగిలో

ద్వేషం చోటుచేసుకుని ఉంటుంది.

విచ్చలవిడిగా విషయభోగాల ననుభవించేవాడిలో

రాగం పేరుకుని ఉంటుంది.

(రాగమూ, ద్వేషమూ రెండూకూడా కర్తృత్వాన్ని గట్టిపరచేవే.)

వ్రతాలూ, నిషేధాలూ లేనివాడు

రాగద్వేషాలనించి తప్పించుకోగలుగుతాడు.

---

విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః |

గ్రహమోక్షవిహీనస్తు న విరక్తో న రాగవాన్ || 16-6 ||

కోరికలు అవివేకానికి ఆస్కారం కలిగిస్తాయి.

అవి ఉన్నంతవరకూ

ఆ అవివేకంవల్ల నిలచిన సంసారవృక్షంనుంచి

రాగద్వేషాలు అంకురిస్తూనే ఉంటాయి.

---

హేయోపాదేయతా తావ త్సంసారవిటపాంకురః |

స్పృహా జీవతి యావ ద్వై నిర్విచారదశాస్పదమ్ || 16-7 ||

ప్రపంచం వెంట సాగితే రాగం పుడుతుంది.

ప్రపంచం నుంచి పారిపోవాలన్న భావం చేత

ద్వేషం పుట్టుకొస్తుంది.

ఇవి రెండూ లేక పసిపిల్లల లేతమనస్తత్త్వంతో

అమాయికంగా బతుకుసాగించేవాడు ధీమంతుడే కదా!

---

ప్రవృత్తౌ జాయతే రాగో నిర్వృత్తౌ ద్వేష ఏవ హి |

నిర్ద్వన్ద్వో బాలవ ద్ధీమా నేవ మేవ వ్యవస్థితః || 16-8 ||

సంసారంపై రాగం ఉన్నవాడు,

ఆ మోజువల్ల పుట్టుకొచ్చే దుఃఖానికి వెరచి,

ఆ దుఃఖం నుండి తప్పించుకోడం కోసం

సంసారాన్ని త్యజించాలని పూనుకుంటాడు.

కాని వీతరాగి,

సంసారంపై మోజు, మోహం లేకపోవటంచేత దుఃఖితు డవడు.

అందుచేత అతడు సంసారంలోనే ఉన్నా సతమతం అవడు.

---

హాతుమిచ్ఛతి సంసారం రాగీ దుఃఖజిహాసయా |

వీతరాగో హి నిర్దుఃఖ స్తస్మి న్నపి న ఖిద్యతి || 16-9 ||

మోక్షం మీద అభిమానం ఉన్నా, వాడు జ్ఞాని కాడు;

దేహం మీద అభిమానంతో ఆసనాలూ కసరత్తులూ చేసినా,

వాడు యోగి కాడు.

అభిమానం ఎట్టిదైనా,

అభిమానం ఉన్నవాడు కేవలం దుఃఖాన్నే అనుభవిస్తాడు.

---

యస్యాభిమానో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా |

న చ జ్ఞానీ న వా యోగీ కేవలం దుఃఖభాగసౌ || 16-10 ||

నీకు ఉపదేశించేవాడు శివుడు కానీ, విష్ణువే కానీ,

బ్రహ్మదేవుడే అయినా,

ఆ నేర్చుకున్న పరిజ్ఞాన మంతా నువ్వు మరిచిపోతేనేగాని

నీకు ఆత్మనిష్ఠ సిద్ధించదు.



---

హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా |

తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే || 16-11 ||

ఇతి షోడశాధ్యాయః

అష్టావక్రు డన్నాడు –

జ్ఞానఫలమైన సంతోషమైనా,

యోగాభ్యాసఫలమైన ఇంద్రియస్వచ్ఛత ఐనా

నిత్యం ఏకాంతంలో విలసిల్లేవాడే

ప్రాప్తం చేసుకోగలడు.

---

*సప్తదశాధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తథా |

తృప్తః స్వచ్ఛేన్ద్రియో నిత్య మేకాకీ రమతే తు యః || 17-1 ||

ఉన్నదల్లా తానొక్కడే అని తెలుసుకున్న తత్త్వజ్ఞుడు,

బ్రహ్మాండమండలమంతాకూడా తానే నిండియుండడం చేత,

ఈప్రపంచంలో ఎప్పుడూ కూడా విచారగ్రస్తుడు కాడుకదా!

---

న కదాచి జ్జగ త్యస్మిన్ తత్త్వజ్ఞో హన్త ఖిద్యతి |

యత ఏకేన తే నేదం పూర్ణం బ్రహ్మాణ్డమణ్డలమ్ || 17-2 ||

సల్లకీ చిగుళ్ళను ఇష్టంగా తినే ఏనుగుకి

వేప చిగుళ్ళు రుచించనట్లు,

మనోనిగ్రహంతో ఆత్మలో విశ్రమించేవారికి

ఎట్టి పరిస్థితులలోనూ

ఎటువంటి ప్రాపంచిక విషయాలూ కూడా రుచింపవు.

---

న జాతు విషయాః కేఽపి స్వారామం హర్షయ న్త్యమీ |

సల్లకీపల్లవప్రీత మి వేభం నింబపల్లవాః || 17-3 ||

తా ననుభవించిన భోగాలపై అధికారభావమూ,

తనకు సిద్ధించని భోగాలకై అఱ్రులు చాచడమూ

ఈ రెండూ లేనటువంటి వారు ఈ ప్రపంచంలో చాలా అరుదు.

---

యస్తు భోగేషు భుక్తేషు న భవ త్యధివాసితా |

అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో భవదుర్లభః || 17-4 ||

ఈ సంసారంలో భోగలాలసులు కనిపిస్తారు.

అలాగే ముముక్షువులనుకూడా చూడవచ్చు.

కానీ, అటు భోగాలపైనా ఇటు మోక్షంపైనా కాంక్షలేనివారు,

రెంటికీ అతీతులైన మహాత్ములు నిజంగా అరుదే!

---

బుభుక్షు రిహ సంసారే ముముక్షు రపి దృశ్యతే |

భోగమోక్షనిరాకాంక్షీ విరళో హి మహాశయః || 17-5 ||

బ్రతుకన్నా, ధర్మార్థకామమోక్షాలన్నా ఒక స్వీకారభావమూ,

మృత్యువుపై తిరస్కారభావమూ

లేని విశాలహృదయులు

ఎక్కడో కానీ కనపడరు కదా!

---

ధర్మార్థకామమోక్షేషు జీవితే మరణే తథా |

కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా న హి || 17-6 ||

ఈ ప్రపంచం పైన ద్వేషభావంకానీ,

ఈ సంసారంబంధం తెగిపోవాలన్న కోరిక కానీ లేక,

తనకు ఏది ప్రాప్తమైతే దాంతో సుఖంగా బ్రతికేవాడు ధన్యుడు.

---

వాంఛా న విశ్వవిలయే న ద్వేష స్తస్య చ స్థితౌ|

యథా జీవికయా తస్మా ద్ధన్య ఆస్తే యథా సుఖమ్ || 17-7 ||

ఇట్టి తత్త్వజ్ఞానం చేత ఈవిధంగా ఆలోచనలు అంతరించి,

వ్యక్తిత్వం సంస్కరింపబడడం చేత, ప్రపంచవిషయాలను

చూస్తూ, వింటూ, స్పృశిస్తూ, ఆఘ్రాణిస్తూ, ఆస్వాదిస్తూ కూడా

నిశ్చింతగా జీవితం గడిపేవాడు కృతార్థుడు.

---

కృతార్థోఽనేన జ్ఞానే నే త్యేవం గలితధీః కృతీ |

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్న న్నాస్తే యథా సుఖమ్ || 17-8 ||

భవసాగరం ఇంకిపోతే (సంసారం అన్న మాయ తొలగితే)

తృష్ణా ఉండదు, విరక్తీ ఉండదు.

దృష్టిలో దృష్టికోణం ఉండదు.

కర్మలు ఫలాపేక్షరహితమైన వౌతాయి.

ఇంద్రియాలు వికలాంగాలవలె విశ్రమిస్తాయి.

---

శూన్యా దృష్టి ర్వృథా చేష్టా వికలా నీన్ద్రియాణి చ |

న స్పృహా న విరక్తి ర్వా క్షీణసంసారసాగరే || 17-౯ ||

జీవన్ముక్తుడికి నిద్రా, మెలకువా అన్న అవస్థలతోనూ,

కళ్ళుమూసి ఉండటం, తెరచుకుని ఉండటం వంటి

స్థితిగతులతోనూ సంబంధం లేదు.

అతడు ఎట్టి పరిస్థితులలోనూ కూడా పరమపదంలోనే ఉంటాడు.

---

న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి |

అహో పరదశా క్వాపి వర్తతే ముక్తచేతసః || 17-10 ||

జీవన్ముక్తుడు దేనిపట్లా మాలిన్యం లేని హృదయంతో,

ఎల్లప్పుడూ ఆత్మనిష్ఠుడై అగుపిస్తాడు.

అతడు ఎట్టి పరిస్థితులలోనూ,

ఎటువంటి కోరికల ఉద్రేకాలకీ లోనుకాని స్వేచ్ఛతో

రాజిల్లుతుంటాడు.

---

సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః |

సమస్తవాసనాముక్తో ముక్తః సర్వత్ర రాజతే || 17-11 ||

ఈ జగత్తులోని విషయాలను

చూస్తూ, వింటూ, స్పృశిస్తూ, ఆఘ్రాణిస్తూ, ఆరగిస్తూ,

గ్రహిస్తూ, మాట్లాడుతూ, చేకొంటూ

అన్ని విధాలా వ్యవహారాల్లో ఉన్నప్పటికీ కూడా,

ఏదైనా పాటించాల్సిన నిర్బంధంకానీ

త్యజించాల్సిన నిర్బంధం కానీ లేని మహానుభావుడు

నిజంగా జీవన్ముక్తుడే!

---

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రు న్నశ్నన్ గృహ్ణాన్ వదన్ వ్రజన్ |

ఈహితానిహితై ర్ముక్తో ముక్త ఏవ మహాశయః || 17-12 ||

జీవన్ముక్తుడు నిందకికానీ, స్తుతికికానీ పాల్పడనివాడు.

దేన్నైనా చూసి ఉప్పొంగిపోవడంగానీ,

ఆగ్రహం చెందటంకానీ ఉండదు.

ఎవరికైనా దానం చేసిన కర్తృత్వం గానీ,

ఏదైనా పుచ్చుకున్న మొహమాటం గానీ అతడికి ఉండదు.

ఈ విధంగా అతడు అన్నిటిపట్లా అనాసక్తుడై మసలుతాడు.

---

న నిన్దతి న చ స్తౌతి న హృష్యతి న కుప్యతి |

న దదాతి న గృహ్ణాతి ముక్తః సర్వత్ర నీరసః || 17-13 ||

అనురాగవతియైన స్త్రీ కనపడ్డప్పుడైనా,

మృత్యువు ఎదురైనప్పుడైనా కూడా

సమభావం కలిగి, చలించని మనస్సుతో

ఆత్మస్థితుడై ఉండగలిగే మహానుభావుడు నిజంగా జీవన్ముక్తుడే.

---

సానురాగాం స్త్రియం దృష్ట్వా మృత్యుం వా సముపస్థితమ్ |

అవిహ్వలమనాః స్వస్థో ముక్త ఏవ మహాశయః || 17-14 ||

ఏది ఎదురైనా ఒకేలా ఎంచే వాడే ధీరుడు.

అట్టి ధీరుడికి, స్త్రీపురుషుల మధ్య హెచ్చు తగ్గులు లేవు.

సుఖం కలిగినా దుఃఖం కలిగినా,

సంపత్తులు అబ్బినా విపత్తులు దాపురించినా,

ప్రత్యేకించి చీమ కుట్టినట్టు ఉండదు.

---

సుఖే దుఃఖే నరే నార్యాం సంపత్సు చ విపత్సు చ |

విశేషో నైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః || 17-15 ||

మనిషికి, ప్రాపంచికమైన లావాదేవీలలో రసం నశిస్తే,

హింసా, కారుణ్యమూ అనే చాదస్తాలూ

గొప్పతనమూ, దీనత్వమూ అనే స్థితిగతులూ

ఆశ్చర్యమూ, నిస్పృహా వంటి భావోద్వేగాలూ

అతన్ని ఎడాపెడా లాగడం ఉండదు.

---

న హింసా నైవ కారుణ్యం నౌద్ధత్యం న చ దీనతా |

నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే || 17-16 ||

జీవన్ముక్తుడు ప్రాపంచిక విషయాలలో మునిగితేలడు.

అలాని ప్రపంచాన్ని ద్వేషించనూ ద్వేషించడు.

తన ప్రాప్తాన్నీ తన దురదృష్టాల్నీ కూడా తలదాల్చి,

అంటీముట్టకండా అనుభవిస్తూవెళతాడు.

---

న ముక్తో విషయద్వేష్టా న వా విషయలోలుపః |

అసంసక్తమనా నిత్యం ప్రా ప్తాప్రాప్త ముపాశ్నుతే || 17-17 ||

ఇది తనకి అనువైందనీ, ఇది అనువుకానిదనీ,

ఇది నచ్చినదనీ ఇది నచ్చనిదనీ అనిపించే

తికమకలూ సందిగ్ధాలూ లేని భోళా మనస్సు వాడు,

“ఉన్నదల్లా ఒక్కటేగా” అన్నట్టుగా తాపీగా ఉంటాడు.

---

సమాధా నాసమాధాన హితాహిత వికల్పనాః |

శూన్యచిత్తో న జానాతి కైవల్య మివ సంస్థితః || 17-18 ||

'నేను ఫలానా, ఇదంతా నాదీ' అన్న భావాలు లేక,

'ఇదంతా కూడా రిక్త' మన్న బుద్ధి గడించినవాడికి

కోరికలన్నీ – తలెత్తకముందే, తనలోపలే - నిర్జీవమైపోతాయి.

అటువంటివాడు కర్మలు చేస్తూ కూడా వాటి ఫలాల పాలు కాడు.

---

నిర్మమో నిరహంకారో న కించి దితి నిశ్చితః |

అన్తర్గలితసర్వాశః కుర్వ న్నపి కరోతి న || 17-19 ||

తన మనస్సును

స్వీయసంకల్పాలు లేవని స్థితిలోకి కరిగించుకున్నవాడు,

జాతకరీత్యా ఏ దశ పట్టినా,

తబ్బిబ్బవడం, కలలు కనడం, స్తంభించిపోవడం అదీ ఉండదు.



---

మనఃప్రకాశ సంమోహా స్వప్నజాడ్య వివర్జితః |

దశాం కా మపి సంప్రాప్తో భవే ద్గలితమానసః || 17-20 ||

ఇతి సప్తదశాధ్యాయః

అష్టావక్రు డన్నాడు–

మెలకువ రాగానే

'కల అంతా వట్టి భ్రమ, నిజంగా జరగలేదు'

అని తెలిసిపోతుంది.

అలాగే, నేను నిజంగా ఎవరినో నాకు బోధ పడగానే,

ఈ 'మెలకువబ్రతుకు' భ్రమ కూడా బట్టబయలౌతుంది.

ఆ విధంగా, 'తాను' తెలియవచ్చి,

నా మెలకువకలలోంచి నన్ను మేలుకొలిపే

నా నిత్యరూపానికి నమస్సులు.

హాయినే రూపుదాల్చి, శాంతమై తేజరిల్లే

నిజమైననాకు నీరాజనాలు.

---

*అష్టాదశాధ్యాయః*

అష్టావక్ర ఉవాచ ||

యస్య బోధోదయే తావ త్స్వప్నవ ద్భవతి భ్రమః |

తస్మై సుఖైకరూపాయ నమః శాన్తాయ తేజసే || 18-1 ||

సకలైశ్వర్యాలనూ సంపాదించడం వల్ల

భోగాలు పుష్కలంగా అనుభవించవచ్చును కానీ,

సుఖ శాంతు లన్నవి మటుకు

ఈ భోగాలన్నిటినీ పరిత్యజించనిదే కలగవు సుమా!

---

అర్జయి త్వాఖిలా నర్థాన్ భోగా నాప్నోతి పుష్కలాన్ |

న హి సర్వపరిత్యాగ మన్తరేణ సుఖీ భవేత్ || 18-2 ||

శమించి మౌనంగా ఉన్నప్పుడు

'ప్రశాంతి' అన్న అమృతధార ఊటలూరుతుంటుంది.

'ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూనే ఉండాలి' అనే కర్తవ్యం వేడికి

ఈ అమృతం ఊట ఆవిరై అంతరంగం మాడిపోతుంది.

అటువంటి కర్తవ్య దుఃఖ మున్న అంతరంగానికి సుఖమేది?

---

కర్తవ్యదుఃఖమార్తణ్డజ్వాలాదగ్ధాన్తరాత్మనః |

కుతః ప్రశమపీయూషధారాసారమృతే సుఖమ్ || 18-3 ||

ఈ సంసారం ఉన్నది కాదు,

“ఉంది” అనుకున్నది మాత్రమే. భావనామాత్రం.

నిజానికి దీనికి ఉనికి లేదు.

ఈ సంసారసాగరం,

జాగ్రదవస్థలో ఉండి, సుషుప్తిలో లేకుండాపోతోంది.

నువ్వు “ఉంది” అనుకున్నప్పుడు ఉంటోంది.

అనుకోనప్పుడు లేకుండా పోతోంది.

నిజంగా దానంతటదే ఉన్న వస్తువు

ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకపోవడం జరగదు.

---

భవోఽయం భావనామాత్రో న కించిత్పరమార్థతః |

నా స్త్యభావః స్వభావానాం భావాభావవిభావినామ్ || 18-4 ||

ఆత్మ అందుబాటుకి దూరంగా లేదు.

దాని వ్యాప్తం తగ్గించడం వల్ల గుప్పిట్లోకి వచ్చేదీ కాదు.

అది ఊహకందేది కాదు.

ప్రయాసపడితే అందేదీ కాదు.

ఒకప్పుడు అంది మరొకప్పుడు అందకపోయే దన్న

మార్పు చెందేదీ కాదు.

అది స్వచ్ఛమైనది.

"అది" కాదు, నువ్వే!

"నే నున్నాను" అనుకునే నీలోని స్ఫురణ!

---

న దూరం న చ సంకోచా ల్లబ్ధ మే వాత్మనః పదమ్ |

నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్ || 18-5 ||

స్వస్వరూపం అవగాహనం చేసుకొన్న మాత్రానే,

ఈ సంసారమనే "గిలక" మీద వ్యామోహదృష్టి పోయి

కనువిప్పు కలిగినవారు,

కంటితెర ('లోపలి తెర') తొలగినవారై,

ఇంక మళ్ళీ శోకమన్నది అనుభవించరు.

---

వ్యామోహమాత్రవిరతౌ స్వరూపాదానమాత్రతః |

వీతశోకా విరాజన్తే నిరావరణదృష్టయః || 18-6 ||

ఈ 'బంధం' అన్నదంతా కూడా కల్పనే, బంధాలేవీ నిజం కావు;

సనాతనమైన తన ఆత్మకి

అసలు మొదటినించీ కూడా ఏ సంకెళ్ళూ లేవు –

అని తెలుసుకున్నాక,

ఇంక ఆ ధీరుడికి మళ్ళీ

నడవడం నేర్చుకుంటున్న చంటిపిల్లాడిలా

ముక్తిసాధనలు అభ్యాసం చెయ్యవలసిన పనేమిటి?

---

సమస్తం కల్పనామాత్ర మాత్మా ముక్తః సనాతనః |

ఇతి విజ్ఞాయ ధీరో హి కి మభ్యస్యతి బాలవత్ || 18-7 ||

ఈ ఆత్మ బ్రహ్మే అని స్పష్టంగా నిర్ధారించుకుని,

సత్యమూ మిథ్యా రెండూకూడా కల్పితాలే అని కనిపెట్టడంతో

కోరికలు తుదముట్టిన మనిషికి,

ఇంక చదువుకోడానికిగాని, చెప్పించడానికిగాని,

చెయ్యడానికిగాని ఏముంది?

---

ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ|

నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్ ||18-8||

అంతా ఆత్మేనని నిశితంగా తెలుసుకుని,

మౌనంలోకి శాంతించిన యోగికి,

ఇలా అయితే నేను భగవంతుణ్ణైనట్టు, ఇలా అయితే కానట్టూ

అనే తలపులు ఇంక మొలకెత్తవు.

---

అయం సోఽహ మయం నాహం ఇతి క్షీణా వికల్పనా |

సర్వ మాత్మేతి నిశ్చిత్య తూష్ణీంభూతస్య యోగినః || 18-9 ||

ఆత్మనిష్ఠచే ఉపశాంతి చెందిన యోగికి

మనస్సు చెదరడమూ, ఏకాగ్రతా

భావాతీతజ్ఞానమూ, భావుకమౌఢ్యమూ

సుఖం, దుఃఖం

ఇలాంటి వికారా లేవీ తలెత్తవు.

---

న విక్షేపో న చైకార్గ్యం నాతిబోధో న మూఢతా |

న సుఖం న చ వా దుఃఖ ముపశాన్తస్య యోగినః || 18-10 ||

తాను రాజ్య మేలుతున్నా, లేక బిచ్చ మెత్తుకోవలసివచ్చినా

లాభం పొందినా, నష్టాలపాలైనా

సంసారంలో మునిగినా, సన్న్యాసిగా అడవులుపట్టినా

యోగియైన వాడికి ఏదీ విశేషంగా కనిపించదు.

ఎందుకంటే

ఆత్మనిష్ఠుడైన యోగి వీటి వేటికీ అర్థాలు తియ్యడు కాబట్టి.

---

స్వారాజ్యే భైక్ష్యవృత్తౌ చ లాభాలాభే జనే వనే |

నిర్వికల్పస్వభావస్య న విశేషోఽస్తి యోగినః || 18-11 ||

ధర్మం, అర్థం, కామం, మోక్షం

అనే పురుషార్థపు వాదాలూ మీమాంసలున్నూ-

చేసుకున్న పుణ్యమూ, నోచుకోనిదీ

అనే తేడాలూ కొరతలున్నూ -

యోగికి వర్తించవు.

ఎంచేతంటే, యోగి అన్నవాడు

'ఏకైకసత్యంగా మిగిలి నిలిచి

ద్వంద్వాల సందిగ్ధాలనుంచి విడుపొందినవాడు.

---

క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితా |

ఇదం కృత మిదం నేతి ద్వన్ద్వై ర్ముక్తస్య యోగినః || 18-12 ||

జీవన్ముక్తుడైన యోగికి,

'ఇది కర్తవ్యం, చెయ్యక తప్పదు' అన్న అంక్షలూ లేవు,

ఈ పని చేస్తే బావుంటుందికదా అన్న కాంక్షలూ లేవు.

తన దైనందిన జీవితం ఎలా సాగితే అలాగే సాగిస్తాడు, అంతే.

---

కృత్యం కి మపి నైవాస్తి న కాపి హృది రంజనా |

యథా జీవన మే వేహ జీవన్ముక్తస్య యోగినః || 18-13 ||

మనస్సులో అన్ని సంకల్పాలనుండీ

విశ్రాంతి పుచ్చుకున్నట్టి మహాత్ముడికి

విశ్వమూ లేదు, విశ్వం మీద మోహమూ ఉండదు.

ఇక అతనికి ధ్యానమేమిటి, ముక్తుడవ్వడం ఏమిటి?

---

క్వ మోహః క్వ చ వా విశ్వం క్వ త ద్ధ్యానం క్వ ముక్తతా |

సర్వసంకల్పసీమాయాం విశ్రాన్తస్య మహాత్మనః || 18-14 ||

ఎవరి కంటికైతే ఈ ప్రపంచం భౌతికంగా కనిపిస్తూందో,

వారే దీనిని మాయ అనీ భ్రమ అనీ ఖండిస్తారు.

ప్రాపంచిక వ్యామోహాలులేని జ్ఞాని ఏం ఖండిస్తాడు?

అత డీ ప్రపంచాన్ని చూస్తూ బ్రహ్మస్వరూపాన్నే దర్శిస్తాడుకాని,

ప్రపంచగా చూస్తే కదా?

---

యేన విశ్వ మిదం దృష్టం స నా స్తీతి కరోతు వై |

నిర్వాసనః కిం కురుతే పశ్య న్నపి న పశ్యతి || 18-15 ||

తన కతీతమైన బ్రహ్మము ఉందనుకున్నవాడు

"అహం బ్రహ్మ" అన్న ధ్యానంలో మడిగట్టుకూర్చుంటాడు.

ఉన్నది ఒక్కటే, అదే తాను అని అసలు ద్వైతంలోనే పడక

నిశ్చింతగా ఉండేవాడు ఏం చింతిస్తాడు? ఏం ధ్యానిస్తాడు?

---

యేన దృష్టం పరం బ్రహ్మ సోఽహంబ్రహ్మేతి చిన్తయేత్ |

కిం చిన్తయతి నిశ్చిన్తో ద్వితీయం యో న పశ్యతి || 18-16 ||

ఎవరి అనుభవంలోనైతే

మనస్సు కోరికలవెంట బయటికి పరిగెడుతూనే గోచరిస్తుందో,

వాడు సాధనలు చేసి దాన్ని నిరోధించుకోవాల్సిన పని ఉంది.

కోరిక లుపశమించి మౌనంగా ఊరికే కూర్చుండేవాడి మనస్సుకి

వెంటాడ్డానికి ఏమీలేదు,

కనక, సాధనలతో పనేమిటి?

---

దృష్టో యే నాత్మవిక్షేపో నిరోధం కురుతే త్వసౌ |

ఉదారస్తు న విక్షిప్తః సా ధ్యాభావా త్కరోతి కిమ్ || 18-17 ||

జ్ఞాని సంసారిలాగే ప్రాపంచికంగా వ్యవహరిస్తున్నా

సంసారానికి అతీతుడైన వాడు.

అతడి అనుభవంలో –

సంసారులకు మల్లే కొరతలూ చికాకులూ గాని,

సాధకులకు మల్లే మనోవిక్షేపమూ సమాధీ గానీ,

కానరావు.

---

ధీరో లోకవిపర్యస్తో వర్తమానోఽపి లోకవత్ |

న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి || 18-18 ||

కలిమిలేముల నెన్నక, వాంఛలు అడుగంటి

సంతుష్టితో బతికే బుధజనుడు,

లోకం దృష్టిలో ఏవో పనులు చేస్తూ ఉన్నట్టు కనిపించినా,

నిజానికి వాటివేటికీ అతను కర్త ననుకోడు.

---

భావాభావవిహీనో య స్తృప్తో నిర్వాసనో బుధః |

నైవ కించిత్కృతం తేన లోకదృష్ట్యా వికుర్వతా || 18-19 ||

ఏదన్నా చెయ్యాలన్నా,

లేదు ఏదన్నా మానెయ్యాలన్నా

జీవన్ముక్తుడికి ఇబ్బందేమీ కలగదు.

ఎప్పుడెలా అవసరమైతే అలా మసులుకుంటూ

సులభంగా హాయిగా ఉంటాడు.

---

ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః |

యదా యత్కర్తు మాయాతి తత్కృత్వా తిష్ఠతః సుఖమ్ || 18-20 ||

జీవన్ముక్తుడు

కోరికలు లేనివాడై,

పట్టుకొమ్మలు అక్కరలేనివాడై,

స్వచ్ఛందంగా, ఒక ఎండుటాకులా

తన ప్రాప్తం వీచే గాలికి సంచరిస్తూంటా డంతే.

---

నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛన్దో ముక్తబన్ధనః |

క్షిప్తః సంస్కారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్ || 18-21 ||

సంసారంతో బేరాలు చెయ్యనివాడికి

హర్షమూ లేదు, విషాదమూ రాదు.

వాడు నిత్యం చల్లని అంతరంగంతో

దేహంలేని దేవతాపురుషుడిలాగా రాజిల్లుతాడు.

---

అసంసారస్య తు క్వాపి న హర్షో న విషాదతా |

స శీతలమనా నిత్యం విదేహ ఇవ రాజతే || 18-22 ||

తన అంతరంగాన్ని

స్వచ్ఛశీతలంగా అమర్చుకుని,

తనలోనే విశ్రమించి ఉండే ధీమంతుడికి

దేనినీ సన్యసించడంగాని,

దేనినీ చెండనాడే అవసరంగాని ఉండదు.

---

కుత్రాపి న జిహా సాస్తి నాశో వాపి న కుత్రచిత్ |

ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః || 18-23 ||

తన జీవితంలో యాదృఛ్ఛికంగా ప్రాప్తించిన కర్తవ్యాన్ని

అరమరికలులేకుండా నెరవేరుస్తూపోయే ధీరుడికి

మామూలుమనుషులకి తోచినట్టు,

“వీళ్ళు సన్మానించారు, వాళ్ళు అవమానించారు”

అని మనస్సులో గొడవలు పుట్టవు.

---

ప్రకృత్యా శూన్యచిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా |

ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా || 18-24 ||

'ఈ కర్మలన్నీ కూడా దేహం చేస్తోంది గాని

పరిశుద్ధాత్మనైన నేను చెయ్యడం లేదు'

అన్న భావంతో మెలిగేవాడు

కర్మలు చేస్తూ వున్నా చేసినవాడవడు.

కర్మఫలాల వలలో దొరకడు.

---

కృతం దేహేన క ర్మేదం న మయా శుద్ధరూపిణా |

ఇతి చి న్తానురోధీ యః కుర్వ న్నపి కరోతి న || 18-25 ||

కర్మల కతీతంగా ఉండాలన్న వేదాంతం తెలియనివాడిలా,

అమాయికంగా, కర్తవ్యం చేస్కుంటూ తిరుగుతాడు.

కాని పిచ్చివాడేం కాదు సుమా.

జీవన్ముక్తుడు ప్రపంచవ్యవహారాల్లో తగులుకున్నాకూడా

ఆనందంతో తులతూగుతుండే జ్ఞానశ్రీమంతుడు.

---

అతద్వాదీవ కురుతే న భవే దపి బాలిశః |

జీవన్ముక్తః సుఖీ శ్రీమాన్ సంసర న్నపి శోభతే || 18-26 ||

నానారకాల ఆధ్యాత్మికవిచారాలూ అంతరించి,

జీవితంలో పరమవిశ్రాంతి లభించడంచేత

ముక్తుడు ఇక ధ్యానమూ, జ్ఞానమూ,

ప్రవచనాలూ, దర్శనాలూ అంటూ తిరగడు.

---

నానావిచారసుశ్రాన్తో ధీరో విశ్రాన్తి మాగతః |

న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి || 18-27 ||

సమాధీ విక్షేపాల వెలుగునీడలనుండి బయటపడడంచేత,

కాంచేదంతా మనస్సు కల్పనే అని కనిపెట్టేసిన మహాశయుడు,

ఇంక ముముక్షువూ మరోటీ కాకండా,

బ్రహ్మపదార్థంగానే మిగిలిపోతాడు.

---

అసమాధే రవిక్షేపాన్ న ముముక్షు ర్న చేతరః |

నిశ్చిత్య కల్పితం పశ్యన్ బ్రహ్మై వాస్తే మహాశయః || 18-28 ||

తనను ఒక వ్యక్తిగా పరిగణించుకొనే అహంకారి

కర్మలేమీ చెయ్యక చేతులుకట్టుక్కూర్చున్నా

కర్మబంధంలో పడక తప్పదు.

తననొక వ్యక్తిగా, కర్తగా పరిగణించుకోక,

తాను నాటకంలో పాత్రని అన్నట్టు నటించే నిరహంకారి

ఎన్ని కర్మలు చేసినా,

తనని బంధంలో పడేసుకునే తప్పు ఏదీ జరగదు.

---

యస్యాన్తః స్యా దహంకారో న కరోతి కరోతి సః |

నిరహంకారధీరేణ న కించి దకృతం కృతమ్ || 18-29 ||

పట్టునుండి విడుదలైనవాడి మనస్సు

ఉద్వేగమూ, ఓదార్పూ, కర్తృత్వభావమూ

ప్రతిక్రియా, కోరికలూ, సందేహాలూ

ఇవేవీ చోటుచేసుకోకండా ప్రశాంతంగా ఉంటుంది.

---

నోద్విగ్నం న చ సన్తుష్ట మకర్తృ స్పన్దవర్జితమ్ |

నిరాశం గతసన్దేహం చిత్తం ముక్తస్య రాజతే || 18-30 ||

ధ్యానం గాని కర్మ గాని

పనిగట్టుకుని చెయ్యాలని పూనుకోని మనస్సే,

ధ్యానం గాని కర్మ గానీ

ఫలాపేక్ష–వలలో పడకుండా చేయడం నేర్వగలదు.

---

నిర్ధ్యాతుం చేష్టితుం వాపి యచ్చిత్తం న ప్రవర్తతే |

నిర్నిమిత్త మిదం కింతు నిర్ధ్యాయతి విచేష్టతే || 18-31 ||

సత్యాన్ని గురించి యదార్థంగా విన్నాక,

మందబుద్ధిగలవా డైతే నిశ్చేష్టు డైపోతాడు.

అటు, నిర్వీర్యుడుకాని వివేకి

విషయలోలత్వం పోవడంతో,

నిశ్చేష్టుడిలాగా అగుపిస్తాడు.

---

తత్త్వం యథార్థమాకర్ణ్య మన్దః ప్రాప్నోతి మూఢతామ్ |

అథవా యాతి సంకోచ మమూఢః కోఽపి మూఢవత్ ||18-32||

అవివేకియైన వాడు

మనస్సులో ఏకాగ్రత సాధించాలనీ,

లేక ఆలోచనలను ఆపి కట్టి పడెయ్యాలనీ

తెగ సాధనలు చేస్తూంటాడు.

బుద్ధిగలవారు

నిద్దట్లో ఉన్నవారిలాగా తమ సహజస్థితి లోనే ఉంటూ,

సాధనల కనికట్టులో పడకుండా ఉంటారు.

---

ఏకాగ్రతా నిరోధో వా మూఢై రభ్యస్యతే భృశమ్ |

ధీరాః కృత్యం న పశ్యన్తి సుప్తవ త్స్వపదే స్థితాః || 18-33 ||

అవివేకి, సాధనలు చేసినా మానేసినా

మనస్సులో నిశ్చలత పొందనేరడు.

నిద్దట్లో ఉన్నట్టు ప్రశాంతంగా ఉండే బుద్ధిమంతుడి కైతే

సాధనలూ త్యజించడాలూ అక్కరలేకుండా,

సత్యం అవగాహన చేసుకున్నమాత్రానికే

మనోనిశ్చలత సిద్ధిస్తుంది.

---

అప్రయత్నాత్ ప్రయత్నా ద్వా మూఢో నాప్నోతి నిర్వృతిమ్ |

తత్త్వనిశ్చయమాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః || 18-34 ||

నిత్యమూ శుద్ధంగా, మెలకువగా, ప్రియంగా,

పూర్ణంగా, అభౌతికంగా, స్వచ్ఛంగా ఉండే

ఆత్మను

– అంటే తమ స్వస్వరూపమైన ఉనికిని –

ఒక వస్తు వనుకుని

దాని గురించిన అభ్యాసనలలో దిగే సాధకులు

తెలుసుకోలేరు.

---

శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిష్ప్రపంచం నిరామయమ్ |

ఆత్మానం తం న జానన్తి త త్రాభ్యాసపరా జనాః || 18-35 ||

అవివేకి

సాధనలు అన్నపేరిట చేసే కర్మలవల్ల

మోక్షఫలం పొందజాలడు.

ధన్యజీవి

కేవలం తత్త్వజ్ఞానం గ్రహించడంచేత

సాధనల గట్టెక్కేసిన ముక్తు డౌతాడు.

---

నాప్నోతి కర్మణా మోక్షం విమూఢోఽభ్యాసరూపిణా |

ధన్యో విజ్ఞానమాత్రేణ ముక్త స్తిష్ఠ త్యవిక్రియః || 18-36 ||

తననుతాను తెలుసుకోని మూఢుడు

ఎంతకోరినా బ్రహ్మజ్ఞానం పొందలేడు.

బ్రహ్మజిజ్ఞాసయే లేకపోయినా

తన ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్న జ్ఞాని

ఇట్టే పరబ్రహ్మస్వరూపుడౌతాడు.

---

మూఢో నాప్నోతి త ద్బ్రహ్మ యతో భవితు మిచ్ఛతి |

అనిచ్ఛ న్నపి ధీరో హి పరబ్రహ్మస్వరూపభాక్ || 18-37 ||

తాము నిరాధారుల మనుకుని, పట్టుకోసం పరితపిస్తూ

సంసారాన్ని పోషించుకునేవారు అవివేకులు.

బతుకులోని అనర్థాలన్నిటికీ

ఆ సంసారమనే గాలమే మూలకారణ మని తెలిసి

ఆ దుష్కారణాన్ని సమూలంగా తెంచేసుకునేవారే వివేకులు.

---

నిరాధారా గ్రహవ్యగ్రా మూఢాః సంసారపోషకాః |

ఏత స్యానర్థమూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః || 18-38 ||

అవివేకికి శాంతి లేదు.

అందుచేతనే ఎంతసేపూ శాంతిని కోరుకుంటూ ఉంటాడు

(శాంతము లేక సౌఖ్యము లేదు).

తనను తాను తెలుసుకున్న ధీమంతుడు

సత్యాన్ని అవగాహన చేసుకుని ఉండటంచేత

ఎల్లప్పుడూ శాంతమైన మనస్సుతో ఉంటాడు.

---

న శాన్తిం లభతే మూఢో యతః శమితు మిచ్ఛతి |

ధీర స్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాన్తమానసః || 18-39 ||

కనిపించే వాటినే (కనిపించి మరుగయే వాటినే)

సత్యమనుకుని బతుకుసాగించే వాడికి

ఆత్మదర్శనమెలా అవుతుంది?

తనను తాను తెలుసుకున్న బుద్ధిమంతుడు

దృశ్యాల వైవిధ్యానికి ఏమరుపాటు చెందడు.

"నేను ఉన్నాను" అనే చెరగని ఎఱుకనే,

– అనగా, మరుగుచెందని ఆత్మనే –

సత్యపదార్థంగా దర్శిస్తాడు.

---

క్వాత్మనో దర్శనం తస్య య ద్దృష్ట మవలంబతే |

ధీరా స్తం తం న పశ్యన్తి పశ్య న్త్యాత్మాన మవ్యయమ్ || 18-40 ||

చిత్తవృత్తి నిరోధం అవాలన్న నిర్బంధమూ తలపూ ఉన్న అవివేవికి

ఆలోచనల నిరోధం ఎలా అవుతుంది?

తన ఉనికి యొక్క ఎఱుకలో స్థిమితంగా విశ్రమించే వాడికి

తలపులు మొలకెత్తకపోవడం అన్నది

సర్వదా అప్రయత్నంగా జరుగుతుంది.

---

క్వ నిరోధో విమూఢస్య యో నిర్బన్ధం కరోతి వై |

స్వారామ స్యైవ ధీరస్య సర్వదాఽసా వకృత్రిమః || 18-41 ||

ఏదో ఉంది అనుకునే ఆస్తికుడు ఒకడు.

ఏదీ లేదు అనుకునే నాస్తికుడు మరొకడు.

ఉంటే ఉంది, లేకపోతే లేదులే అన్నట్టు ఉండే

మూడోరకం వాడు ఇంకొకడు –

ఈ సిద్ధాంతాల పట్టింపులేవీ లేక నిశ్చింతగా ఉంటాడు.

---

భావస్య భావకః కశ్చి న్న కించి ద్భావకోఽపరః |

ఉభయాభావకః కశ్చి దేవ మేవ నిరాకులః || 18-42 ||

బుద్ధితార్కికులు ఆత్మ శుద్ధమైనదనీ అద్వయమనీ విని

కల్పనలు చేస్తూంటారు,

వారు జీవితాంతం

విరామ మెరుగని ఆత్మసాధనల మాయామోహంలో పడటం చేత

ఆ ఆత్మ తామే అని మటుకు స్వయంగా గ్రహింపజాలరు.

---

శుద్ధ మద్వయ మాత్మానం భావయన్తి కుబుద్ధయః |

న తు జానన్తి సంమోహా ద్యావజ్జీవ మనిర్వృతాః || 18-43 ||

మోక్షం కోరేవాడి బుద్ధి

ఎప్పుడూ ఏదో ఒక పట్టుకి (ఆలంబనకి) ఆనుకోకండా ఉండదు.

ముక్తుడి బుద్ధిమాత్రం, కోరికలూ లేకపోవడంచేత,

ఎప్పుడూకూడా ఏ ఆలంబనమూ లేని

విడుపు స్థితిలోనే ఉంటుంది.

---

ముముక్షోర్బుద్ధి రాలంబ మన్తరేణ న విద్యతే |

నిరాలంబైవ నిష్కామా బుద్ధి ర్ముక్తస్య సర్వదా || 18-44 ||

విషయలోలు లైనవారు

జీవితంలో నానా విషయాలూ ఎదుర్కొని

భయంచేత భక్తులైపోతారు.

తరవాత, యోగులై

ఆ విషయాల తలపులను నిరోధించుకోడానికీ,

విషయాలకి చెదిరిన మనస్సును ఏకాగ్రం చేసుకోడానికీ

గుహలలో దూరతారు.

---

విషయద్వీపినో వీక్ష్య చకితాః శరణార్థినః |

విశన్తి ఝుటతి క్రోధం నిరోధైకాగ్రసిద్ధయే || 18-45 ||

కోరికలు లేనివాడు సింహం లాంటి వాడు.

అటువంటివాణ్ణి చూసి, ఈ భోగాలు అనే ఏనుగులు

తోక ముడుచుకుని చల్లగా జారుకుంటాయి.

అలా పలాయనం చిత్తగించే శక్తి లేనప్పుడు, ఆ భోగాలు

వాడి దర్బారులో చేరి వాడి సేవచేసుకుంటాయి.

---

నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదన్తినః |

పలాయన్తే న శక్తా స్తే సేవన్తే కృతచాటవః || 18-46 ||

సందేహాలు మానిపోయి,

మనస్సుని ఆత్మగా మిగుల్చుకున్నవాడు

రకరకాల ముక్తిసాధనల గురించిన తర్జనభర్జనలలో పడక,

దైనందిన జీవితంలో, విషయాలను మామూలుగా

చూస్తూ, వింటూ, స్పృశిస్తూ, ఆఘ్రాణిస్తూ, ఆరగిస్తూ కూడా

యోగిలాగా ఆనందంగా ఉంటాడు.

---

న ముక్తికారికాం ధత్తే నిఃశఙ్కో యుక్తమానసః |

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రు న్నశ్న న్నాస్తే యథాసుఖమ్ || 18-47 ||

మనస్సు తేలికపరచుకున్నవాడు,

పరిపరివిధాల ఆలోచనలు పోనివాడు,

సత్యవస్తువుగురించి విన్నంతమాత్రానికే, తిన్నగా

ఆచారమూ, అనాచారమూ, ఉదాసీనతా

అనే సాధనాప్రక్రియల మాయని దాటిపోతాడు.

---

వస్తుశ్రవణమాత్రేణ శుద్ధబుద్ధి ర్నిరాకులః |

నైవాచార మనాచార మౌదాస్యం వా ప్రపశ్యతి || 18-48 ||

ఋజువర్తనం గలవాడు (నిజాయితీపరుడు),

ఎప్పు డేది ప్రస్తుతమో అది చేస్తూ పోతాడు –

అది మంచికిందైనా లెక్కవవచ్చు, చెడుకిందైనా లెక్కకావచ్చు.

మరి, అట్టివాడు చేసే పనులన్నీకూడా

అరమరికలు తెలీని పసివాడి చేష్టల్లానే ఉంటాయి.

---

యదా యత్కర్తు మాయాతి తదా త త్కురుతే ఋజుః |

శుభం వా ప్యశుభం వాపి తస్య చేష్టా హి బాలవత్ || 18-49 ||

తన అంతరాత్మని శాంతంగా ఉంచుకుని,

తన అంతరాత్మ నోరు నొక్కేస్తూ ఉండకుండా,

తన అంతరాత్మని భక్తిగా నమ్మి,

అంతరాత్మ చెప్పినరీతిలో స్వేచ్ఛగా బతకడమే స్వాతంత్ర్యము.

దానివల్ల వచ్చే ఫలితాలని

ప్రసాదంలా స్వీకరించగలగడమే స్వాతంత్ర్యము.

అలా జీవించినట్లైతేనే ఆనందమూ, ఔన్నత్యమూ,

మోక్షమూ పరమపదమూ కూడా లభిస్తాయి.

---

స్వాతంత్ర్యా త్సుఖ మాప్నోతి స్వాతంత్ర్యా ల్లభతే పరమ్ |

స్వాతంత్ర్యా న్నిర్వృతిం గచ్ఛే త్స్వాతంత్ర్యాత్ పరమం పదమ్ || 18-50 ||

తన చేతిమీదుగా జరుగుతున్న వన్నీ తనే చేసేస్తున్నట్టూ,

వాటి పుణ్యపాపాల భారం తనే మోసేస్తున్నట్టూ

అనుకోడం మానేస్తే,

దాంతో చిత్తంలోని పోకడలూ అలజడులూ

సమస్తమూ మానుతాయి.

---

అకర్తృత్వ మభోక్తృత్వం స్వాత్మనో మన్యతే యదా |

తదా క్షీణా భవ న్త్యేవ సమస్తా శ్చిత్తవృత్తయః || 18-51 ||

జ్ఞానియొక్క విశృంఖలమైన ప్రవర్తన కూడా

అకృత్రిమం కాబట్టి ముచ్చటగానే ఉంటుంది.

కానీ, కోరికలుపట్టిన మూఢుని ప్రవర్తన,

శాంతవర్తనమైనా కూడా

కృత్రిమం కావటంచేత మెప్పించదు.

---

ఉచ్ఛృంఖలా ప్యకృతికా స్థితి ర్ధీరస్య రాజతే |

న తు సస్పృహచిత్తస్య శాన్తి ర్మూఢస్య కృత్రిమా || 18-52 ||

జ్ఞానులు దేనికీ బద్ధులు కారు.

మనస్సులోని కల్పనల ప్రభావం వారిపై పనిచెయ్యదు.

వారి బుద్ధికూడా, ఒక మూసలో ఇమడదు.

వారు మహాభోగాలమధ్య విలాసంగా బతకనూ గలరు,

లేక కొండలకీ గుహలకీ నిష్క్రమించనూ గలరు.

---

విలసన్తి మహాభోగై ర్విశన్తి గిరిగహ్వరాన్ |

నిరస్తకల్పనా ధీరా అబద్ధా ముక్తబుద్ధయః || 18-53 ||

తీర్థాలాడినప్పుడుకాని,

వేదపండితులనీ, దేవతలనూ పూజించుకున్నప్పుడుకాని,

ఒక స్త్రీనో, మహారాజునో, మిత్రుడినో చూసినప్పుడుకానీ

జ్ఞాని మనస్సులో ఎటువంటి వాసనలూ వాంఛలూ చెలరేగవు.

---

శ్రోత్రియం దేవతాం తీర్థ మజ్జనాం భూపతిం ప్రియమ్ |

దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాపి హృది వాసనా || 18-54 ||

నౌకర్లో, పుత్రులో, భార్యలో, మనవలో

ఎవరైనా తనని పరిహసించినా, ధిక్కరించినాగానీ

ఒక యోగియైన వాడికి చటుక్కున ఆక్రోశం కలగదు.

---

భృత్యైః పుత్రైః కలత్రైశ్చ దౌహిత్రై శ్చాపి గోత్రజైః |

విహాస్య ధిక్కృతో యోగీ న యాతి వికృతిం మనాక్ || 18-55 ||

సంతుష్టి చెందినా పొంగిపోడు,

ఖేదం కలిగినా కుంగిపోడు.

అతడి ఆశ్చర్యవంతమైన స్థితిగతులు

అయా స్థితులలో ఉన్నవారు మాత్రమే ఎరుగగలరు.

---

సన్తుష్టోఽపి న సన్తుష్టః ఖిన్నోఽపి న చ ఖిద్యతే |

త స్యాశ్చర్యదశాం తాం తాం తాదృశా ఏవ జానతే || 18-56 ||

కర్తవ్యలోలత్వమే సంసారం.

జ్ఞానులు శూన్యాకారంతోనూ, నిరాకారంతోనూ సారూప్యంచెంది

నిర్వికారులూ నిష్కళంకులూ కావటంచేత,

ఈ కర్తవ్యమోహంలో చిక్కుకోరు.

---

కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యన్తి సూరయః |

శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయాః || 18-57 ||

ఏమీ చెయ్యకుండానే మూఢచిత్తులు

ప్రతిదానికీ చింతాగ్రస్తు లౌతూంటారు.

శాంతచిత్తుడు తాను చేస్తున్నవన్నీ చేస్తూ కూడా

చీకూ చింతా లేకుండా ఉంటాడు.

---

అకుర్వ న్నపి సంక్షోభా ద్వ్యగ్రః సర్వత్ర మూఢధీః |

కుర్వ న్నపి తు కృత్యాని కుశలో హి నిరాకులః || 18-58 ||

శాంతచిత్తుడు ఉట్టప్పుడే కాదు,

వ్యవహారాలలో దిగినప్పుడుకూడా, మధురంగా మాట్లాడతాడు,

కుదురుగా కూచుంటాడు, ప్రశాంతంగా తిరుగుతాడు,

నెమ్మదితో భోంచేస్తాడు, హాయిగా పడుకుంటాడు.

---

సుఖ మాస్తే సుఖం శేతే సుఖ మాయాతి యాతి చ |

సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాన్తధీః || 18-59 ||

ఎవరైతే లోకులవలె వ్యవహరిస్తూ కూడా

విసుగుచెందని స్వభావం కలవారో,

అట్టివారు క్షోభపడక దుఃఖానికి అందక,

ఒక మహా సరోవరంలాగా నిండుగా గలగలలాడుతూ ఉంటారు.

---

స్వభావా ద్యస్య నై వార్తిర్లోకవద్వ్యవహారిణః |

మహాహ్రద ఇ వాక్షోభ్యో గతక్లేశః సు శోభతే || 18-60 ||

మూఢుని నివృత్తిసాధనలు కూడా ప్రవృత్తిజనకంగానే ఉంటాయి.

ఎందుచేతనంటే, తెలియక

వారు నివృత్తినికూడా ఒక ప్రవృత్తికింద చేపడతారు.

జ్ఞానియొక్క వ్యవహారప్రవృత్తులు కూడా

నివృత్తిస్థితినుండి చేపట్టినవై,

నివృత్తి ఇచ్చే సత్ఫలితాలనే కలిగిస్తాయి.

---

నివృత్తి రపి మూఢస్య ప్రవృత్తి రుపజాయతే |

ప్రవృత్తి రపి ధీరస్య నివృత్తిఫలభాగినీ || 18-61 ||

బంధాల మధ్య ఉన్న మూఢుడు

తరుచు వైరాగ్యం తెచ్చుకునే విశ్వప్రయత్నాలు కనబడతాయి.

కానీ, శరీరం మీదా శారీరకం మీదా వ్యామోహం పోయిన

ధీరుడికి రాగం ఏమిటి, వైరాగ్యం ఏమిటి?

---

పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే |

దేహే విగలితాశస్య క్వ రాగః క్వ విరాగతా || 18-62 ||

మూఢుని దృష్టి ఎంతసేపూ

'నేను ఇలా తయారవాలి, అలా తయారవకూడదు'

అన్న నిర్ణయాల మీదే కేంద్రీకృతమై ఉంటుంది.

తన ఆత్మలో స్థితుడైఉన్న శాంతచిత్తునికి

తాను 'ఇలా ఉండాలి, అలా ఉండకూడదు' అన్న ధ్యాస ఉండడు.

---

భావనాభావనాసక్తి ర్దృష్టి ర్మూఢస్య సర్వదా |

భా వ్యభావనయా సా తు స్వస్థ స్యాదృష్టిరూపిణీ || 18-63 ||

ఏ పని తలపెట్టినా, స్వార్థచింతలో చిక్కుకోక,

అది చిన్నపిల్లల ఆటలాగా సరదాగా తీసుకుని

చేసుకుంటూ పోయేవాడే ఒక పవిత్రుడైన ముని.

అతడు లోకవ్యవహారాల మధ్య వ్యస్థుడై ఉన్నప్పటికీ

అతనిని కర్మ మైలలు ఏవీ అంటవు.

---

సర్వారంభేషు నిష్కామో యశ్చరే ద్బాలవ న్మునిః |

న లేప స్తస్య శుద్ధస్య క్రియమాణోఽపి కర్మణి || 18-64 ||

దైనందిన జీవితంలో తన పంచేంద్రియాలతో

బాహ్యప్రపంచంలో వ్యవహరిస్తున్నప్పుడుకూడా,

మనస్సులో తృష్ణ రేగకుండా, సమచిత్తుడై ఉన్నవాడే

తన స్వరూపరహస్యాన్ని తాను తెలుసుకున్నట్టి

ఆత్మజ్ఞుడు. ధన్యుడు.

---

స ఏవ ధన్య ఆత్మజ్ఞః సర్వభావేషు యః సమః |

పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్న న్నిస్తర్షమానసః || 18-65 ||

ఎల్లప్పుడూ, ఆకాశం లాగా, ఖాళీమనస్సు గల ధీరుడికి

సంసారసాగరం ఏమిటి, మాయ ఏమిటి?

సాధన ఏమిటి, సాధించడానికి ఏముంది?

---

క్వ సంసారః క్వ చాభాసః క్వ సాధ్యం క్వ చ సాధనమ్ |

ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా || 18-66 ||

ఎవరైతే జీవితధ్యేయాలవెనక పాకులాడడం మానేశారో,

ఎవరైతే పరిపూర్ణంగా ఆత్మరుచి ఆకారందాల్చి ఉంటారో,

ఎవరైతే అప్రయత్నపూర్వకంగా తన అఖండాకారస్వరూపంలో

ఇల్లుకట్టుకుని ఉంటారో,

వారే జీవితంలో ఉత్తీర్ణులౌతారు.

వేయేల? ఎప్పుడూ దేనిమీదా రుచిప్రోద్బలం లేని వాడై,

అటు భోగాలకీ ఇటు మోక్షానికీ కూడా

అర్రులుచాచకుండా ఉండే మహాశయుడే

తత్త్వరహస్యాన్ని ఎరిగినవాడు.

---

బహు నాత్ర కి ముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః |

భోగమోక్షనిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః || 18-68 ||

'విశ్వంలో దాటవలసినవనుకునే మహత్తూ హిరణ్యగర్భమూ

ఇత్యాది ద్వైతాలన్నీ కూడా నామమాత్రాలు;

మాటలవలన పుట్టినవి, మాటలలో మాత్రమే విహరించగలిగేవి'

అన్న మెలకువ కలిగి,

వీటిని సత్యా లనుకోవడం మానేసి

తెలివిని తేలికపరుచుకున్నవాడికి

ఇంక దాటవలసినదీ చేయవలసినదీ ఏమి మిగిలుంది?

---

మహదాది జగ ద్వైతం నామమాత్రవిజృంభితమ్ |

విహాయ శుద్ధబోధస్య కిం కృత్య మవశిష్యతే || 18-69 ||

ఇదంతా కూడా తనయొక్క భ్రమ మోసే భారమేననీ,

కించిత్తుకూడా సత్యంకాదనీ నిర్ధారణ చేసుకున్నవాడికి,

కనిపించే దృశ్యాలు లక్ష్యాలుగా స్ఫురించడం మానేస్తాయి.

ఆ విధంగా అతడు స్వచ్ఛమైన అంతఃకరణం గలిగి

స్వాభావికంగానే శాంతి చెందుతాడు.

---

భ్రమభృత మిదం సర్వం కించి న్నా స్తీతి నిశ్చయీ |

అలక్ష్యస్ఫురణః శుద్ధః స్వభావే నైవ శామ్యతి || 18-70 ||

దృశ్యప్రపంచం నిజ మన్న ఏమరుపాటు లేనివాడు

తన ఉనికియొక్క స్ఫురణయే తనస్వరూపంగా మిగులుతాడు.

అలాటి చైతన్యమూర్తికి

దీక్ష లేమిటి, వైరాగ్య మేమిటి,

సన్యాస మేమిటి, శమదమాలు వేటికి?

---

శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావ మపశ్యతః |

క్వ విధిః క్వ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపి వా || 18-71 ||

'ప్రకృతి' అన్న ప్రతిబంధమే కానని ఎఱుకకి,

అనంతచైతన్యస్వరూపంగా స్పందించే ఉనికికి

హర్ష మేమిటి, విషాద మేమిటి,

బంధ మెక్కడిది, మోక్షం దేనినుంచి?

---

స్ఫురతోఽనన్తరూపేణ ప్రకృతిం చ న పశ్యతః |

క్వ బన్ధః క్వ చ వా మోక్షః క్వ హర్షః క్వ విషాదితా || 18-72 ||

‘ఈ సంసారం తలపులలోనే ఉంది (తలపులకి బయటలేదు),

మాయామాత్రంగానే ప్రవర్తించగలదు (నిజంగా కాటెయ్యలేదు)’

అన్న తెలివి గలిగిన బుధజనుడు,

“నేను, నే” నన్న అహమూ, “నాది, నా” దన్న వ్యామోహమూ,

“నాకు, నా” కన్న వాంఛా లేనివాడై

శోభిల్లుతాడు.

---

బుద్ధిపర్యన్తసంసారే మాయామాత్రం వివర్తతే |

నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః || 18-73 ||

దుఖవిహీనమైనదీ క్షీణమేలేనిదీ అయిన

తన స్వస్వరూపాన్ని కనుగొన్న మునికి

నేర్వడానికి విద్య యేముంది,

గెలవవలసిన విశ్వం ఎక్కడుంది?

“నేను దేహాన్ని” అన్న అపోహ గానీ,

“దేహం నా”దన్న భ్రమ గానీ ఎందుకు కలుగుతుంది?

---

అక్షయం గతసన్తాప మాత్మానం పశ్యతో మునేః ।

క్వ విద్యా చ క్వ వా విశ్వం క్వ దేహోఽహం మ మేతి వా ॥ 18-74 ॥

అలాగని, జడబుద్ధిగలవాడుకనక,

ఒకవేళ

చిత్తవృత్తినిరోధక ధ్యానం వంటి సాధనాప్రక్రియలు మానేస్తే,

మరుక్షణమే

పగటికలలకీ, ప్రేలాపనలకీ లోనై కూర్చుంటాడు.

నిరో ధాదీని కర్మాణి జహాతి జడధీ ర్యది |

మనోరథాన్ ప్రలాపాంశ్చ కర్తు మాప్నోతి తత్ క్షణాత్ || 18-75 ||

మందబుద్ధి గలవాడికి

సత్యవస్తువుగురించి శ్రవణం చేశాక కూడా

అజ్ఞానం వైదొలగదు.

చేపట్టిన సాధనలవల్ల, వేషం వల్లా,

బయటికి నిర్వికల్పుడిలా కనిపించినా,

లోపల్లోపల భోగలాలసుడైయుంటాడు.

---

మన్దః శ్రుత్వా పి త ద్వస్తు న జహాతి విమూఢతామ్ |

నిర్వికల్పో బహి ర్యత్నా దన్త ర్విషయలాలసః || 18-76 ||

జ్ఞానప్రాప్తిచేత కర్మప్రవాహం గట్టెక్కినట్టివాడు

లోకదృష్ట్యా కార్యమగ్నుడై ఉన్నా,

అతడికి ఏదైనా

చేయాల్సిన మొహమాటంగానీ,

చెప్పాల్సిన ప్రోద్బలంగానీ

ఏమీ ఉండదు.

---

జ్ఞానా ద్గలితకర్మా యో లోకదృష్ట్యాపి కర్మకృత్ |

నాప్నో త్యవసరం కర్తుం వక్తు మేవ న కించన || 18-77 ||

సదా నిర్భయుడైయుండి, దిగజారని ధీమంతుడికి

అంధకారమేమిటి, ప్రకాశమేమిటి?

ఆ అంధకారం నుండి ప్రకాశంలోకి పోవడంకోసం

త్యజించడాలేమిటి?

---

క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వ చ న కించన |

నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా || 18-78 ||

యోగియైన వాడి స్వభావం అనిర్వచనీయం.

అసలు అతడు స్వభావరహితుడు. స్వభావముక్తుడు.

అట్టివానికి ధీరుడనీ, వివేకి అనీ, నిర్భయుడనీ

పరిమితగుణాలూ లక్షణాలూ ఆపాదించడం ఎలాగ తగును?

---

క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంక తాపి వా ।

అనిర్వాచ్యస్వభావస్య నిఃస్వభావస్య యోగినః ॥ 18-79 ॥

స్వర్గమూ లేదు. నరకమూ లేదు.

జీవన్ముక్తి అనేదీ లేదు, నిజానికి.

అంతెందుకు,

యోగదృష్టిలో ఏదీ లేదు.

ఈ ద్వంద్వాలూ, హెచ్చు తగ్గులూ మొలకెత్తని

దివ్యదృష్టిని పొందినవాడే యోగి.

---

న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తి ర్న చైవ హి |

బహు నాత్ర కి ముక్తేన యోగదృష్ట్యా న కించన || 18-80 ||

ధీరపురుషుడి చిత్తం చల్లగా ఉంటుంది.

అమృతంతో నిండినట్టుగా ఉంటుంది.

అతడు ఏదైనా లభించాలని మొక్కులు మొక్కేసుకోడు,

లభించక పోయినా, లభించలేదని వాపోడు.

---

నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి |

ధీరస్య శీతలం చిత్త మమృతే నైవ పూరితమ్ || 18-81 ||

కోరికల దురద లేనివాడు

సజ్జనులని స్తుతించడం, దుర్జనులని నిందించడం

వంటివి చెయ్యడు.

సుఖదుఃఖాలలో, రెండిటా సమానమనస్కుడై

ఎప్పుడూ సంతుష్టికలిగి,

అస్సలు సతమత మవకుండా,

తీరికగా ఉంటాడు.

---

న శాన్తం స్తౌతి నిష్కామో న దుష్ట మపి నిన్దతి |

సమదుఃఖసుఖ స్తృప్తః కించి త్కృత్యం న పశ్యతి || 18-82 ||

జ్ఞానికి సంసారం అంటే రోతా ఉండదు,

ఆత్మదర్శనానికై కళ్ళు కాయలూ కాయవు.

అతడికి కుంగిపోడాలూ పొంగిపోడాలూ ఉండవుకనక

అతడు జీవచ్ఛవమూ కాడు, జీవనభారమూ మోయడు.

---

ధీరో న ద్వేష్టి సంసార మాత్మానం న దిదృక్షతి |

హర్షామర్షవినిర్ముక్తో న మృతో న చ జీవతి || 18-83 ||

భార్యాబిడ్డలమీద వ్యామోహంగానీ

విషయభోగాలమీద లాలసంగానీ లేక,

ఆఖరికి,

తనశరీరం, తనసౌందర్యం పట్ల మమకారం కూడా లేకుండా

నిశ్చింతగా తులతూగుతాడు జ్ఞాని.

---

నిఃస్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషు చ |

నిశ్చిన్తః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః || 18-84 ||

ఏ స్థితి దక్కితే దాని కనుగుణంగా మసులుకుంటూ,

స్వతంత్రంగా తిరుగుతూ,

ఎక్కడ పొద్దుగుంకితే అక్కడే పడుకుంటూ

సద్దుకుపోయే ధీమంతుడికి

ఎటుతిరిగినా సంతుష్టేకదా!

---

తుష్టిః సర్వత్ర ధీరస్య యథాపతితవర్తినః |

స్వచ్ఛన్దం చరతో దేశాన్ య త్రాస్తమితశాయినః || 18-85 ||

ఆత్మనిష్ఠలో విశ్రాంతిచెందే మహాత్ముడికి

ఈ అంతుతెగని సంసారచక్రంతో సంబంధం తెగిపోతుంది.

ఇక తన దేహం గతించబోతుందనో, మళ్ళీ పుట్టబోతుందనో,

ఆ చింతలు అతడికి మిగలవు.

---

పత తూదేతు వా దేహో నాస్య చిన్తా మహాత్మనః |

స్వభావభూమివిశ్రాన్తి విస్మృతాశేషసంసృతేః || 18-86 ||

ఆత్మబుద్ధి కలిగినవాడు దేనివెంటాపడడు.

అతడికి ద్వంద్వసందిగ్ధాలూ ధర్మసందేహాలూ ఉండవు.

ఏ బాంధవ్యాల వ్యామోహంలోనూ చిక్కుకోక,

తన పరిపూర్ణ కైవల్యంలో ఆనందిస్తాడు.

---

అకించనః కామచారో నిర్ద్వన్ద్వ శ్ఛిన్నసంశయః |

అసక్తః సర్వభావేషు కేవలో రమతే బుధః || 18-87 ||

జ్ఞానికి మట్టీ, రాయీ, బంగారమూ అన్నీ సమానమే.

ఆత్మచైతన్యమైన తనను తాను జడదేహ మనుకునే భ్రమముడి

అతనిలో పూర్తిగా విడివడి ఉంటుంది.

అతడియందు రజోగుణమూ తమోగుణమూ

శుభ్రంగా ప్రక్షాళితమై ఉంటాయి.

దాంతో, నాది—నాదన్న మమకారపు మబ్బు పట్టక శోభిల్లుతాడు.

---

నిర్మమః శోభతే ధీరః సమలోష్టాశ్మకాంచనః |

సుభిన్నహృదయగ్రన్థి ర్వినిర్ధూతరజస్తమాః || 18-88 ||

అతడు దేనిమీదా కేంద్రీకృత దృష్టి లేనివాడు.

మనస్సులో కోరికల గుర్తులుకూడా మిగలనివాడు.

అంత సంతుష్టుడైన జీవన్ముక్తుని ఎవరితో పోల్చగలము?

---

సర్వ త్రానవధానస్య న కించి ద్వాసనా హృది |

ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే || 18-89 ||

అతడు గ్రహిస్తూ కూడా గ్రహించడు.

చూస్తూ కూడా చూడడు.

చెపుతూ కూడా చెప్పడు.

ఒక్క కోరికలులేని జీవన్ముక్తుడికే తప్ప

మరెవ్వరికీ ఇది సాధ్యంకాదు.

జాన న్నపి న జానాతి పశ్య న్నపి న పశ్యతి |

బ్రువ న్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనాదృతే || 18-90 ||

ఎవరికైతే మనస్సులో, 'ఇది మంచీ ఇది చెడూ'

అన్న ఎన్నికా, పక్షపాతం అంతరించిందో,

ఎవరైతే కోరికలులేనివాడో,

వాడు మహారాజు అయినా బిచ్చగాడే అయినా

శోభిల్లుతాడు.

---

భిక్షుర్వా భూపతిర్వాపి యో నిష్కామః స శోభతే |

భావేషు గలితా యస్య శోభనాశోభనా మతిః || 18-91 ||

అమాయికమైన నిజాయతీ కలిగి

సార్థకజీవియైన యోగికి

స్వచ్ఛందతా, ఇబ్బందీ అన్న తేడాలు లేవు.

ఇంక అదనంగా తత్త్వవివేకంతో ఏం పని?

---

క్వ స్వాచ్ఛన్ద్యం క్వ సంకోచః క్వ వా తత్త్వవినిశ్చయః |

నిర్వ్యాజార్జవభూతస్య చరితార్థస్య యోగినః || 18-92 ||

తన ఆత్మలో విశ్రమించి తృప్తిచెందగా కోరికలు అడుగంటి,

దుఃఖం అంతరించినవాడు

అంతరంగంలో పొందే అనుభూతిని

ఎవరికి ఎలాగ చెప్పనౌతుంది?

---

ఆత్మవిశ్రాన్తితృప్తేన నిరాశేన గతార్తినా |

అన్త ర్యదనుభూయేత త త్కథం కస్య కథ్యతే || 18-93 ||

ఆత్మజ్ఞాని అడుగడుగునా తృప్తినే ననుభవిస్తాడు.

సుషుప్తిలో నిద్రకాదు, తృప్తిననుభవిస్తాడు.

స్వప్నావస్థలో కలకాదు తృప్తినే రుచి చూస్తాడు.

జాగ్రదవస్థలో మెలకువగాకాదు తృప్తిగానే ఉంటాడు.

---

సుప్తోఽపి న సుషుప్తో చ స్వప్నేఽపి శయితో న చ |

జాగరేఽపి న జాగర్తి ధీర స్తృప్తః పదే పదే || 18-94 ||

జ్ఞానికి

ఆలోచనా, ఇంద్రియకర్మలూ,

బుద్ధికుశలతా, అహంకారస్ఫురణా

అన్నీ ఉన్నా - ప్రయోజనాలుగానే ఉంటాయిగానీ,

ఇవేవీ అతని అంగాలు కావు.

ఇవేవీ అతని అంగాలుకావన్న సంగతీ అతడికి తెలుసు.

---

జ్ఞః సచిన్తోఽపి నిశ్చిన్తః సేన్ద్రియోఽపి నిరిన్ద్రియః |

సుబుద్ధి రపి నిర్బుద్ధిః సాహంకారోఽనహఙ్కృతిః || 18-95 ||

ధీమంతుడికి సుఖదుఃఖాలతో పని లేదు.

వైరాగ్యమా సంసారమా అన్న సందిగ్ధం లేదు.

ముముక్షువు ననో ముక్తుడ ననో ఊహించుకోడు.

తానేదో గొప్పవాడిననీ అనుకోడు,

లేక ఏమీకానివా ణ్ణనీ వినయాలుపోడు.

---

న సుఖీ న చ వా దుఃఖీ న విరక్తో న సంగవాన్ |

న ముముక్షు ర్న వా ముక్తో న కించి న్న చ కించన || 18-96 ||

# ధన్యుడైన జ్ఞాని

సమాధిలోనో, విక్షేపంలోనో, జాడ్యంతోనో ఏ స్థితిలో ఉన్నా,

ఆ స్థితికి లొంగిపోయి తన అనంత అతీత సత్యాన్ని విస్మరించడు.

అతడికి పాండిత్యమే అబ్బినా

పండితుడికింద తాను పరిమితం అయిపోడు.

పరిపూర్ణుడిగానే ఉంటాడు.

---

విక్షేపేఽపి న విక్షిప్తః సమాధౌ న సమాధిమాన్ |

జాడ్యేఽపి న జడో ధన్యః పాణ్డిత్యేఽపి న పణ్డితః || 18-97 ||

జీవన్ముక్తుడు సహజంగా స్వస్థుడై

తన ఉనికిలోనే నెలవు కల్పించుకు నుంటాడు.

ఎదురొచ్చిన కర్తవ్యం ఎప్పటికప్పుడు చేసేస్తూండడంచేత

శాంతిగా ఉంటాడు.

తృష్ణలే లేనిమూలాన అన్నిటా సమభావంతో ఉంటాడు.

కాబట్టి, "ఇది సాధించాము ఇదింకా సాధించాలి"

అన్న ప్రణాళికలు వేస్తూ ఉండడు.

---

ముక్తో యథాస్థితిస్వస్థః కృతకర్తవ్యనిర్వృతః |

సమః సర్వత్ర వైతృష్ణ్యా న్న స్మర త్యకృతం కృతమ్ || 18-98 ||

# జీవన్ముక్తుడు

నమస్కారాలకి పొంగిపోడు.

నిందిస్తే మండిపడడు.

మరణం దాపురిస్తే కంగారూ పడడు,

బతికిపోయా నని పండగా చేసుకోడు.

---

న ప్రీయతే వన్ద్యమానో నిన్ద్యమానో న కుప్యతి |

నై వోద్విజతి మరణే జీవనే నాభినన్దతి || 18-౨౨ ||

## జీవన్ముక్తుడు

జనసంచారం వెతుక్కుంటూ పరుగులు తీయడు,

అలాగని అరణ్యాలకి నిష్క్రమించి కళ్ళుమూసుకునీ కూర్చోడు.

తాను ఉన్నచోట, తాను ఎప్పుడూ ఉన్నట్టుగానే

స్థిమితంగా ఉంటాడు.



---

న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాన్తధీః |

యథా తథా యత్ర తత్ర సమ ఏ వావతిష్ఠతే || 18-100 ||

ఇతి అష్టాదశాధ్యాయః

జనకు డన్నాడు –

తత్త్వవిజ్ఞానమనే కొక్కెంతో

నా హృదంతరాళంలోంచి

రకరకాల అపోహల ముళ్ళను

ఊడబెరికించుకున్నాను కదా!

---

*ఏకోనవింశాధ్యాయః*

జనక ఉవాచ||

తత్త్వవిజ్ఞాన సన్దంశ మాదాయ హృదయోదరాత్ |

నానావిధ పరామర్శ శల్యోద్ధారః కృతో మయా || 19-1 ||

నా అంతరంగవైభవంలో కుదురుగా ఉన్న నాకు

ధర్మార్థకామమోక్షాలతోనూ, ద్వైతాద్వైతాలతోనూ

సంబంధమేముంది? పనేముంది?

---

క్వ ధర్మః క్వచ వా కామః క్వచార్థః క్వవివేకితా|

క్వద్వైతం క్వచ వాద్వైతం స్వమహిమ్ని స్థితస్య మే || 19-2 ||

నా అంతరంగవ్యాప్తిగా అమరిఉన్న నాకు

భూత భవిష్య ద్వర్తమానాలూ

అసలు దేశ కాల పరిస్థితులూ

ఎక్కణ్ణుంచి వర్తిస్తాయి?

---

క్వ భూతం క్వ భవిష్య ద్వా వర్తమాన మపి క్వ వా |

క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే || 19-3 ||

నా స్వమహిమలో అలరారుతున్న నాకు

ఆత్మానాత్మలూ, శుభాశుభాలూ అన్న విభజనలులేవు.

చింతన అనీ, చింతనారాహిత్యం అనీ విభేదాలు లేవు.

---

క్వ చాత్మా క్వ చ వానాత్మా క్వ శుభం క్వాశుభం తథా |

క్వ చిన్తా క్వ చ వాచిన్తా స్వమహిమ్ని స్థితస్య మే || 19-4 ||

నా మహిమలోనే కొలువై ఉన్న నాకు

జాగ్రత్ స్వప్న సుషుప్తు లనే అవస్థాత్రయంతో చిక్కులులేవు.

అట్టి ఆత్మస్థితుడనైన నన్ను

భయభ్రాంతు లేమీ చేయవు,

తురీయసాధన లెక్కడికీ తీసుకువెళ్ళవు.

---

క్వ స్వప్నః క్వ సుషుప్తి ర్వా క్వ చ జాగరణం తథా |

క్వ తురీయం భయం వాపి స్వమహిమ్ని స్థితస్య మే || 19-5 ||

నా ఆత్మవైభవంలో నిలిచి ఉన్న నాకు

దూరమూ దగ్గరా, బయటా లోపలా,

స్థూలమూ సూక్ష్మమూ

అన్న అంతరాలు కానరావు.

---

క్వ దూరం క్వ సమీపం వా బాహ్యం క్వాభ్యన్తరం క్వ వా |

క్వ స్థూలం క్వ చ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే || 19-6 ||

ఆత్మనిష్ఠలో స్థిరంగా ఉన్న నాకు

జననమరణాల చక్రం నుండి బయటపడాలనిగానీ,

లోకాన్నీ లౌకికవ్యవహారాలనీ సన్యసించాలనిగానీ,

లయా, సమాధీ మొదలైన

యోగస్థితులను సాధించాల్సిన అగత్యంగానీ

లేదు.

---

క్వ మృత్యు ర్జీవితం వా క్వ లోకాః క్వాస్య క్వ లౌకికమ్ |

క్వ లయః క్వ సమాధి ర్వా స్వమహిమ్ని స్థితస్య మే || 19–7 ||

నా ఆత్మలోనే హాయిగా విశ్రమించి ఉండే నాకు

ధర్మార్థకామాల కథనం చాలు చాలు.

యోగసాధనల రహస్యాలు ఇంకక్కరలేదు.

వేదాంత విజ్ఞానపు చర్చలు చాలు బాబూ చాలు.



---

అలం త్రివర్గకథయా యోగస్య కథయా హ్యలమ్ |

అలం విజ్ఞానకథయా విశ్రాన్తస్య మ మాత్మని || 19-8 ||

ఇతి ఏకోనవింశాధ్యాయః

జనకుడన్నాడు–

నిరంజనమైన నా స్వరూపంలో

పంచభూతా లేమిటి, పంచేంద్రియా లేమిటి?

మనస్సనే దెక్క డుంది?

శూన్యానికీ నిరాశకీ అసలు తావేదీ?

---

*॥ వింశతిమోధ్యాయః ॥*

జనక ఉవాచ ॥

క్వ భూతాని క్వ దేహో వా క్వేన్ద్రియాణి క్వ వా మనః ।

క్వ శూన్యం క్వ చ నైరాశ్యం మ త్స్వరూపే నిరంజనే ॥ 20-1 ॥

సర్వదా ద్వంద్వాతీత స్వరూపుడనే ఐన నాకు

శాస్త్ర మేమిటి, ఆత్మజ్ఞాన మేమిటి?

నిర్వికల్పమానస మేమిటి?

తుష్టి ఏమిటి, వైరాగ్యమేమిటి?

క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వ వా నిర్విషయం మనః |

క్వ తృప్తిః క్వ వితృష్ణాత్వం గతద్వన్ద్వస్య మే సదా || 20-2 ||

విద్య ఏమిటి, అవిద్య ఏమిటి?

అహం–జ్ఞాన మేమిటి, ఇదం–జ్ఞాన మేమిటి?

మమకార మేమిటి, బంధ మేమిటి, మోక్ష మేమిటి?

ఆత్మస్వరూపుడనైన నాకు

రూపకల్పన ఏమిటి?

(ఈ వేదాంత పదజాలమేదీ ఆత్మస్వరూపుడనైన నాకు చెందదు)

---

క్వ విద్యా క్వ చ వావిద్యా క్వాహం క్వేదం మమ క్వ వా |

క్వ బన్ధ క్వ చ వా మోక్షః స్వరూపస్య క్వ రూపితా || 20-3 ||

వైయక్తిక విశేషం ఏనాడూ లేని నాకు

ప్రారబ్ధకర్మ లేమిటి, జీవన్ముక్తి ఏమిటి?

ఇంకా, విదేహముక్తి ఏమిటి?

---

క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తి రపి క్వ వా |

క్వ త ద్విదేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా || 20-4 ||

వ్యక్తిస్వభావమే లేని నాలో

కర్త ఎవరు, భోక్త ఎవరు?

కార్యస్ఫూర్తి ఎక్కడుంది, నైష్కర్మ్యం ఎక్కడుంది?

ప్రత్యక్షఫల మేమిటి, పరోక్షఫల మేమిటి?

---

క్వ కర్తా క్వ చ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వ వా |

క్వాపరోక్షం ఫలం వా క్వ నిఃస్వభావస్య మే సదా || 20-5 ||

నా ఉనికీ స్వరూపమూ అద్వయమై ఉండగా,

ఇంక అందులో

లోక మెక్కడుంది?

ముముక్షువూ, యోగీ, జ్ఞానీ ఎవరున్నారు?

బద్ధుడూ, ముక్తుడూ ఎక్కణ్ణించొచ్చారు?

---

క్వ లోకః క్వ ముముక్షు ర్వా క్వ యోగీ జ్ఞానవాన్ క్వ వా |

క్వ బద్ధః క్వ చ వా ముక్తః స్వస్వరూపేఽహ మద్వయే || 20-6 ||

నేను ఉన్నది అద్వయమైన నా స్వరూపంలో.

మరి సృష్టి ఏమిటీ, సంహార మేమిటి?

సాధకు డెలా వచ్చాడు?

సాధ్యమూ, సాధనా, సిద్ధీ ఇవన్నీ ఎక్క డున్నాయి?

---

క్వ సృష్టిః క్వ చ సంహారః క్వ సాధ్యం క్వ చ సాధనమ్ |

క్వ సాధకః క్వ సిద్ధి ర్వా స్వస్వరూపేఽహ మద్వయే || 20-7 ||

నిత్యమూ విమలమైన నా ఉనికిలో

ప్రమాతా, ప్రమాణమూ, ప్రమేయమూ, ప్రమా అంటూ

నానాపాత్రలు చొప్పించడ మెందుకు?

అల్పమనీ, అనల్పమనీ – వేరే వేరే విలువలు ఎందుకు?

---

క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వ చ ప్రమా |

క్వ కించిత్ క్వ న కించి ద్వా సర్వదా విమలస్య మే || 20-8 ||

ఎల్లప్పుడూ నిష్క్రియుడనే అయిన నా సత్యస్వరూపంలో,

విక్షేపమూ ఏకాగ్రతా వంటి యోగావస్థలూ,

జ్ఞానమూ అజ్ఞానమూ అన్న వేదాంతవిశేషాలూ,

హర్షమూ విషాదమూ అన్న మనో వికల్పాలూ

అప్రస్తుతమైనవి. అసందర్భమైనవి.

---

క్వ విక్షేపః క్వ చైకాగ్ర్యం క్వ నిర్బోధః క్వ మూఢతా |

క్వ హర్షః క్వ విషాదో వా సర్వదా నిష్క్రియస్య మే || 20-9 ||

అసలు, విలువలూ విచారమూ మొలకెత్తని నా సత్యస్వరూపంలో

సంసార మెక్కడ, పరమార్థ మెక్కడ?

సుఖానుభవ మేమిటి, దుఃఖానుభవ మెందుకౌతుంది?

---

క్వ చైష వ్యవహారో వా క్వ చ సా పరమార్థతా |

క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా || 20-10 ||

ఎల్లప్పుడూ పరిశుద్ధుడనైన నాలో –

మాయా, సంసారమూ

రక్తీ, విరక్తీ

జీవుడూ, బ్రహ్మమూ –

ఇటువంటి మరక లేవీ లే వసలు.

---

క్వ మాయా క్వ చ సంసారః క్వ ప్రీతి ర్విరతిః క్వ వా |

క్వ జీవః క్వ చ త ద్బ్రహ్మ సర్వదా విమలస్య మే || 20-11 ||

నిశ్చలసత్యం నుంచి వేరు కానివాడినీ,

ఆత్మస్థుడినీ అయిన నాకు

ప్రవృత్తిమార్గ మేమిటి, నివృత్తిమార్గ మేమిటి?

బంధన మేమిటి, ముక్తి ఏమిటి?

---

క్వ ప్రవృత్తి ర్నిర్వృత్తి ర్వా క్వ ముక్తిః క్వ చ బన్ధనమ్ |

కూటస్థనిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా || 20-12 ||

అశరీరమైన శివస్వరూపుడనైన నాకు

ఉపదేశ మేమిటి, శాస్త్ర మేమిటి?

శిష్యు డేమిటి, గురు వేమిటి?

అసలు పురుషార్థ మేమిటి?

---

క్వోపదేశః క్వ వా శాస్త్రం క్వ శిష్యః క్వ చ వా గురుః |

క్వ చాస్తి పురుషార్థో వా నిరుపాధేః శివస్య మే || 20-13 ||

ఆస్తికత్వం ఏమిటి, నాస్తికత్వం ఏమిటి?

అద్వైత మేముంది, ద్వైత మేముంది?

వేయేల?

నా సత్యంలో ఏ వాదమూ రేగదు.

**॥ ఓం తత్సత్ ॥**



---

క్వ చాస్తి క్వ చ వా నాస్తి క్వాస్తి చైకం క్వ చ ద్వయమ్ ।

బహు నాత్ర కి ముక్తేన కించి న్నోత్తిష్ఠతే మమ ॥ 20-14 ॥

*ఇతి వింశాధ్యాయః*

BACK COVER

బంధం అంటే

సుఖంకోసం ప్రాపంచికవిషయాల వెంటపడవలసి రావడం.

మోక్షం అంటే

మన సుఖశాంతులకై ప్రాపంచిక విషయాల వెంటపడవలసిన

అగత్యం లేకపోవటం.

తెలుసుకోవలసిన వేదాంతరహస్యమల్లా ఇంతే.

ఇక నీకు ఎలా తోచితే అలా చెయ్యి.



ఆత్మజ్ఞాని అడుగడుగునా తృప్తినే ననుభవిస్తాడు.

సుషుప్తిలో నిద్రకాదు, తృప్తి ననుభవిస్తాడు.

స్వప్నావస్థలో కలకాదు తృప్తినే రుచి చూస్తాడు.

జాగ్రదవస్థలో మెలకువగాకాదు తృప్తిగానే ఉంటాడు.